# CHITHOPADESA SATAKAM

BY

BUDHIRAJU ANNAMRAJU, B. A.,
*Urlam, Ganjam District.*

FIRST EDITION, 1,000 COPIES.

Madras:
PRINTED AT THE VAIJAYANTI PRESS,
32, *Mount Road.*

1905.

 [Price As. 1-6.

శుభమస్తు.

శ్రీదక్షిణామూర్తయేనమః.

---

# చిత్తోపదేశశతకము.

గంజాంజిల్లా ఉర్లాం గ్రామనివాసియగు

బుద్ధిరాజు - అన్నంరాజుపంతులుచే

రచియింపఁబడినది.

మొదటి కూర్పు 1,000 ప్రతులు.

చెన్నపురి:

వైజయంతీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

---

1905.

 వెల ణా

శుభమస్తు.

శ్రీదక్షిణామూర్తయేనమః.

# చిత్తోపదేశశతకము.

ఉ॥ శ్రీగిరిజామనోహరునిఁ జిత్తజకోటి సహస్రసుందరున్।
నాగసురారివిస్ఫుహరు నందితభక్తజనాళి శంకరున్।
సాగరకన్యకారమణ సాయకు భూతిసమాజనాయకున్।
బాగుగ నమ్ముమీ సకలబంధములూడెడు నీకు చిత్తమా॥ ౧.

ఉ॥ ఏలఁగృపాలవాల కరుణించవిదేలర జాలిలేదురా।
బాలశశాంకమౌళి భవబాధల కింతియుఁ దాళఁజాలరా।
చాలఁగ జాలమాయె దయఁజల్లి సుశీలుఁడ! మేలొసంగురా।
నీలగళార్తపాలయని నెయ్యముతో శివు వేఁడు చిత్తమా॥ ౨.

మ॥ అవని న్గానఁగవచ్చు నంతయును శైవాకారమే కాన నీ।
కెవఁ డేమైనను గీడొనర్ప మరల న్నింపింపఁగాఁబోలదో।
భవపాశాతుల జాలలగ్నపశుమకంబా! నీదు రక్షార్థమై।
భువనాధీశు నుమేశు వేఁడి కరుణ న్బొంద న్దగు న్జిత్తమా॥ ౩.

ఉ॥ పారదమంటిన న్బసిఁడి భాసురకాంతి విహీనమౌనటుల్।
క్రూరులసంగతి న్వైదును కోవిదుఁడైనను గాన నీదురా।
చారులసంగము న్విడిచి సజ్జనసేవ యొనర్చి యంబికా।
చారుముఖాబ్జభాస్కరుని సన్నుతిఁ జేయుము నీవు చిత్తమా॥ ౪.

ఉ॥ శిష్టజనాళిపాలనము చేసెదవంచును పెద్దలెంతయున్।
స్పష్టముగా వచించుటను సంతస మందితిఁగాని యిష్టు నా।
దుష్టపువర్తన న్దలఁచి దుఃఖము జెందితి రావె కావవే।
కష్టము బెట్టకే యనుచుఁ గంధినిషంగుని వేఁడు చిత్తమా॥ ౫.

ఉ॥ ఈమహిమానవుల్ నిను నుపేంద్రుఁడవింద్రుఁడవంచు సన్నుతుల్।
ప్రేమనుగాని వేఱె యొకభీతినిగాని యొనర్ప, దానికీ।
వేమఱు కేను మొక్క నరహీనుఁడఁ, దేవుఁడగానటంచు స।
ద్ధీమహితత్వము న్దనరి, తేటగ నీశునిఁ గొల్వు చిత్తమా॥ ౬.

చ॥ చిలుకలఁబోలి నీతులను జెప్పినలోకులు నీకు మన్ననల్।
సలుపరుసుమ్ము, నీచులని సర్గముదంభము, పూర్ణకుంభముల్।
దొలఁకునె? కాన మానమును మానను మెద్దియు విన్నచంద్రభృ।
ద్భాలసితమంచు నెంచుము వివేకము వర్ధిలు నీకు చిత్తమా॥ ౭.

చ॥ పలుకులు వేయునేలఁ బరబాధయ పాపమటంచు నమ్మి నీ।
పలుకుల నమ్ముపార్థివుఁడు ప్రాజ్ఞుఁడుకాఁడని యెంచి కొండెముల్।
బలికి పరీతులౌ జనుల బాధను జేయక నీవు మొజ్జనే।
పలుకుచు గాలము న్డపి ప్రాపగు నీశు భజింపు చిత్తమా॥ ౮.

ఉ॥ తిండియె ముఖ్యమైన మలదేహమె సర్వమటంచు నమ్మి నిన్।
బండితవర్యులెల్లఁ గటుభాషలఁ దిట్టఁగఁ బాపకృత్యముల్।
బండె డొనర్చి తుట్టతుదఁ బాశము వైచి కృతాంతుఁ డీడ్వ నీ।
పిండమి కేమి జేసెదవు వేఁడు గిరీశుని ముందె చిత్తమా॥ ౯.

మ॥ జగదౌన్నత్యము గాంచి సత్పథమున న్సంచారము న్సల్పుచున్।
నగధీరత్వమున న్మెలంగి విలసన్నాదంబు సంధించుచున్।
జగతి న్కీర్తి ఘనాళినిం బొగడఁగాఁ జాలంగలేకున్న, నే।
వగ నెగ్గలుదు, నంచు శంకరుని వేఁప్రార్థింపుమా చిత్తమా॥ ౧౦.

ఉ॥ జీవము లేనిబొందిపలెఁ, జేవ దనర్చని ప్రాణులీరునన్।
భావ మెఱుంగనట్టి శ్రుతిపాఠముచాడ్పున, లోభివిత్తమున్।
గైవడి, భక్తి నీశ్వరుని గానము సేయనిపుట్టువుల్ వృథా।
కావున, నించుకైన గిరికార్ముకు భక్తిఁ దలంపు చిత్తమా॥ ౧౧.

చ॥ ఇల నెది నీవు విత్తెదవొ యేర్పడ నద్దియె మొల్చునట్లుగాఁ।
దొలుతను బెట్టి పుట్ట నిది దుర్లభ మీభవమందుఁ గావునన్।
గలిగినవానికల్మికిని గంటక, సేయుది గాంచి, తుష్టితో।
మెలఁగుచు, నంబికాధవుని మేలునకై భజియింపు చిత్తమా॥ ౧౨.

ఉ॥ ఎందరుభూపు లిద్ధరణి నేలిరి యందుల నీలకంధరున్।
బొందుగ భక్తితో మిగులఁ బూజ లొనర్చినవారలే జనా।
నంద మెలర్ప నిప్పటికి నాశము లేనియశమ్ము జెంది రా।
చందము నెంచి నీవు రవిచంద్రవిలోచను వేఁడు చిత్తమా॥ ౧౩.

ఉ॥ ఆరయ వేఁడినీళ్లను గృహంబులు గాలు నె యట్లు భక్తిపై।
జారులమీాద చిత్త మది శంకనుపైనను నట్లు నాత్మలోఁ।
గ్రూరపుఁ జింతలం బొదలి కుస్కుచు దొంగజపంబుఁ జేసినన్।
జేరఁగఁ గల్గు జేశ్వరుని సేవలు సేయక ముక్తి చిత్తమా॥ ౧౪.

ఉ॥ బొందికిఁ బెట్టు నాభరణపుంజము పొల్పున నూరబందికిన్।
గందమలందుచుందమున గంపును శుష్కముఁ జేయువారులన్।
బొందగు నీ వివేకమును బోనఁగనియ్యకు లబ్ధిలేదు బా।
లేందు ధరార్చనానుతుల నెంతయు నుంచి తరింపు చిత్తమా॥ ౧౫.

ఉ॥ కాఁ దగు కార్య మెద్దియును గాకను మానదు గాన నూరకే।
వాదులఁ దెచ్చిపెట్టు నిజపౌరుషము న్మరి జూప నేమియా।
నే దెట్లులైన నుంతియు జలించక నీశ్వరుయందు భక్తిమై।
ఖేదము మోదము న్విడిచి కృత్తిధరు న్భజియింపు చిత్తమా।

చ॥ ఉదరము నింపుపిండమునకు ర్వినరు న్నరి వేడనేల నీ।
వదను దలంచి రమ్యమగు నశ్మతలంబులఁ బండ్లచెట్టులన్।
ప్రదముల వాసయోగ్యమగు నయ్యగసీమల కేగి శంకరున్।
సదయు దలంచుచు న్దపము సల్పుచుఁ గాలము బుచ్చు చిత్తమా॥

శా॥ వారిం బుట్టెడు బుద్బుదంబు లిల నవ్వారి న్లయం బందవే।
యేరీతి న్జనియించు భూతతతి యట్లే యీల్గు నద్దానికిన్।
భీరుత్వమ్మున గుండె బాదుకొనుచు న్బిన్నోలలన్బెట్టకే।
ధీరత్వమ్మును జూపి శంకరునిఁ బ్రార్థింప న్దగు న్జిత్తమా॥ ౧౮.

చ॥ పదిలముజేసి యెవ్వఁడిలఁ బక్షిమృగాళికి మేతవెట్టు నా।
సదయుఁడు నీకొసంగకను చంపఁగఁ జూచునె యేటివెఱ్ఱి నీ।
కిది యది యన్చు రేయిఁబవ లేడ్చుట మాని సమస్తవాంఛలన్।
వదలి సుఖంచి యీశ్వరునిపాదముల న్భజియింపు చిత్తమా॥ ౧౯.

ఉ॥ దానము సేయలేను విధి దప్పితకర్మ మొనర్పలేదు ను।
స్నానముఁ బుణ్యతోయములఁ జల్పఁగలేను త్వదీయనామమున్।
గానము సేయలే దెటులఁ గాచెదొ నమ్మితి నిన్నె బ్రోవవే।
దీనుఁడనంచు వేఁడు హిమదీధితిశేఖరుఁ బాడు చిత్తమా॥ ౨౦.

ఉ॥ ఎన్నఁ ద్రికాలసంగతుల నేర్పడ దివ్యవిలోకనమ్ముచేఁ।
దిన్నఁగఁ గాంచఁ గల్గిన సుధీవరులౌ మునిపుంగవుల్ బుషుల్।
నిన్ను నుతింప నేరరిక నే నన నెంతవివేకశూన్యుఁడన్।
ఖిన్నుఁడ కావవే యనుచుఁ గేవలు నీశు భజింపు చిత్తమా॥ ౨౧.

చ॥ పరసతిఁ గోరకే నియతపద్ధతివీడక కల్లలాడకే।
పరులమనంబుల న్గలకిఁబొరఁగనీకిఁ గలంకఁ జెందకే।
పరధనవాంఛఁ గైకొనక భంగురదేహము నమ్మబోక యు।
ష్పరశివుఁ బూజసేసి యనపాయముగా నివసించు చిత్తమా॥ ౨౨.

ఉ॥ కాయము లస్థిరంబులు వికారకరంబు ధనంబు చుట్టముల్।
మోయఁగరాని రాళ్లవలె ముంతురు నీరధిసంసృతి న్జనున్।
సేయఁగరాని కృత్యములఁ జేయునహంకృతి గాన పార్వతీ।
నాయకుసేవ దక్క భువినాస్తిసుఖాకర మొండు చిత్తమా॥ ౨౩.

ఉ॥ పాలను ద్రావ నాసఁగొని పామువిషంబును గ్రోలుమాడ్కి దుః।
ఖాలయసంసృతి న్సుఖదమంచు భ్రమ న్గణియించి మంటలో।
గూలుపతంగము న్బలెను గ్రొవ్వి నశించెదవేటి కర్మమే।
చాలును బుద్ధి దెచ్చుకొని సాంబునిసౌఖ్యదుఁ గొల్వు చిత్తమా॥

ఉ॥ రంగమున న్గుశీలవులు రంజనకై తమలో వియోగమున్।
సంగతు లొందుచుండ నవి సత్యముగా మది నెంతు రెవ్వరా।
భంగి జెలంగుఁ గాన భవబంధువియుక్తియు సంగతంబులున్।
భంగములేని యాశివుని బంధువుగా నెఱనమ్ము చిత్తమా॥ ౨౫.

ఉ॥ కామితవస్తులాభమున గర్వము నంది మదించి డంభముల్।
వేమఱుఁ గొట్టు నీమహిమ వింతగ నాపద లందుఁ గానరా।
దే మది మీదుమిక్కిలి మహేశుని దూఱెదు మొండివాచు నీ।
వామతమాని సేమమున వామునిభక్తి భజింపు చిత్తమా॥ ౨౬.

ఉ॥ చంచలకాంచనంబు గనఁజాలక జీవితకాలమంత వం।
చించి వృథా యొనర్చి కడుఁజిక్కులఁ జొచ్చి కృశించనేల నీ।
వంచితభక్తి నీశ్వరుని హాయి దలంచి సుఖించ నెంచుటల్।
మంచిదికాదె సర్వము నుమాపతి కర్పితమంచుఁ జిత్తమా॥ ౨౭.

చ॥ గతభవకోటు లీభవముకైనడిఁ గావ్రెకో? యందు బంధుసం।
తతులు దొరంగరే? యిదియె తథ్యము నాఁగఁ దలంచి దొల్లిదో।
గతమతి! వచ్చుజన్మమునఁ గాఁగల దిద్దియు వానిపోల్కి నీ।
మతి దలపోసి తత్త్వమును మానుగ శంకరుఁ గొల్వు చిత్తమా॥

ఉ॥ సంచితకర్మసంతతుల సంహృతి సల్ప నశక్తివై విజృం।
భించు ప్రచండవాయువుల ప్రేరణచే వివశత్వ మంది యే।
తెంచు పయోదబృందములతీరునఁ బుట్టుచు గిట్టనేల న।
ప్పంచశరారి గొల్చి సుఖభావ మికైననుఁ బొందు చిత్తమా॥ ౨౯.

ఉ॥ విత్తముచే మదంబును, వివేక వినాశము, దానిచేత నా।
పత్తున కాస్పదంబు లగుపాపకృతు ల్క్షతి వానిచేత సం।
పత్తు హరించు దుర్యశము, ప్రాజ్ఞులధిక్కృతి, సంభవించు నా।
విత్తముఁ గోరకే శివుని ప్రీతిభజింపఁగఁ గోరు చిత్తమా॥ 30.

ఉ॥ సుంతయుఁ జేయలేక విధిచోదితకృత్యములే యొనర్చి య।
త్యంతము గాలివీచునటు లాడెడు నాకులపోల్కి పృథ్విలో।
నెంతయు సంచరించి విగతేక్షణుఁ డంధుని నాశ్రయించు లా।
గింతకుఁ గానిమానవుల నెంచక నీశునిఁ జేరు చిత్తమా॥ 31.

ఉ॥ విత్తమదాంధులౌ నృపుల వేడుకమాటల కుబ్బి నీవును।
న్మత్తతఁ జెంది నక్క పులిమచ్చల నారసి పుచ్చునట్లు తా।
నొత్తుగ వాతలుంచుకొని యూరకె చచ్చువితానఁగాక యా।
పొత్తిక మాని సర్పపతిభూషణుసేవ లొనర్చు చిత్తమా॥ 32.

ఉ॥ బాపురె! చేఁదనూతఁ బడ బగ్గముగూడ దొరంగ నెంతురే।
యేపథమందు నింతవఱ కేమి యొనర్చినఁ బోవనిమ్ము సం।
తాప మిఁకైనఁ జెంది వడిఁ దాలిమి నారసి మంచిపెద్దలన్।
బ్రాపుగ నమ్మి మీశ్వరుని భవ్యముసేకురు నీకుఁ జిత్తమా॥ 33.

ఉ॥ కాయము నంగముల్ దృఢముగానె చెలంగఁగ జన్మమోచనో।
పాయము తెల్లమై తనరఁ బాటుపడ న్భయమొంది యత్నముల్।
జేయక కాలము న్వృథగఁ జేసి తుది న్ధృతిదూల నమ్మ య।
బ్బా యని యేడ్వ నేమియగు భర్గుని నిప్పుడె వేఁడు చిత్తమా॥

ఉ॥ మొక్కను వంచలేని తరిమోదును వంచగ శక్యమౌనె? యూ।
చక్కని దుష్టమౌ వ్యసనసంగతి బాల్యమునుండి మూఢవై।
చిక్కిన యోగ్యకాలమున శీతకరార్థవిభూషచింతకున్।
జిక్కదు కాలమంచు హరుసేవయె యెప్పుడు సల్పు చిత్తమా॥

ఉ॥ దేవుఁడు లేడు తీర్థములు దీనజనావళి జీవనార్థముల్।
భావమునందు దోఁచునదె పద్ధతి వృత్తికటంచు నిట్లు నా।
నావిధనిందితంబు లగునాస్తికవాదములెల్ల మాని స।
ద్భావముతోడ శంకరునిపాదము నమ్మి సుఖింతు చిత్తమా॥ ౩౬.

ఉ॥ భవమే సాగరమందు మానవులె నావ ల్మీవు చుక్కానులన్।
సవరించఁగల నావికాధిపతివెంచ స్మోదఖేదంబులన్।
బవనోద్ధూతి నహంకృతాఁగములపై భంగంబు జెందింపకే।
భవపాదార్చన సత్పథంబు లెటుబోవ న్జూచెదో చిత్తమా॥ ౩౭.

ఉ॥ యేమియు లబ్ధిలేనియెడ నింతకుముందుగ దేవతల్ మునుల్।
నీమముతో మహేశ్వరుని నిచ్చలుఁ గొల్చి ప్రపూర్ణకాములై।
సేమము గాంచి రంచుఁ దగ జెప్పెడుగాథలు పిచ్చికూఁతలే।
సోమరి! దుర్గుణం బుడిగి సోముని నమ్మి తరింపు చిత్తమా॥ ౩౮.

చ॥ కలుషపునుయ్యి దుఃఖములఁ గ్రాలెడుగ్రాయియ్యి మరంతదుర్గుణా।
వళులను గూడుపెంట ధృతివాయు సహంకృతి మందుమంట వి।
చ్చలవిడి నేగువాహమున సంగతదేహము దీనిపైని ని।
ష్ఫలమగుభ్రాంతుల న్వదలి శర్వపదాబ్జము గోరు చిత్తమా॥ ౩౯.

మ॥ వినుమా నీకొక మంచిమాట చెపుదు న్విశ్వేశు నర్చింప నీ।
ఘనపుణ్యమ్మునఁ బ్రీతిజెంది కృప సాక్షాత్కారుఁడౌ కాలమం।
దున నింద్రాదిపదంబు లెంతయు నిసీతుచ్ఛంబు లవ్వానిఁ గై।
కొనకే సుస్థిరశైవపాదనిరతి న్గోరందగు న్జిత్తమా॥ ౪౦.

ఉ॥ పెద్దలు చెప్పుమాటలను బేరిదలంచక నీసడించెదో।
గద్దరి! నీసమానులిలఁ గానఁగరారని విఱ్ఱవీగెదే।
ప్రొద్దును నీప్రతాపమునఁ బొంగెదు నీకిది శాశ్వతంబొకో।
దిద్దము దిద్దు నీనడతఁ దెల్విగ భర్గుని వేఁడి చిత్తమా॥ ౪౧.

ఉ॥ ఎన్ని తెఱంగుల న్దెలుప నిన్నియు నీపెడ వీనునుంచెదే।
క్రన్ననఁ గేలునగ్గి శగఁగాలిన నాకులు బట్టనేమియౌఁ।
జెన్నఁటి! నీదు ముందుగతి శీఘ్రముగాఁ దలపోసి యొద్దియో।
తెన్ను దలంచి ముందె హరు దెల్విగ వేఁడి సుఖింపు చిత్తమా॥

చ॥ చపలతఁ గొంద రుర్వి జనసంఘము వంచనఁ జేయఁగోరి స।
త్తపసులపోల్కి వేషములఁ దాల్చి పయి న్ద్రణమ్ముల్లు బొడునూ।
తిపగిది దుష్టచిత్తు లగుతీరున నీవిల నట్లుగాక ని।
ష్కపటపుభక్తి భూతపతిచారుపదమ్ముల నమ్ము చిత్తమా॥ ౪3.

ఉ॥ పుట్టితి సర్వశూన్యముగ భోగివిభూషదయ న్సమస్తముల్।
గట్ట భుజింపఁబెట్టుటకుఁ గల్గె రవంతయు దాని నొడ్లకుల్।
బెట్టక మూటగట్టెదు విభీషణమృత్యువు ద్రుంచ నద్ది నిల్।
బట్టుకొనంగ నోపునె? కృప న్శివుఁడోమినఁగాక చిత్తమా॥ ౪౪.

ఉ॥ గాలము మాంసలోభమున గ్రక్కున మ్రింగి నశించుమీనముల్।
బోలి యసత్యవరాసుఖముఁ బొందఁగ నెంచి దురంతమైన త।
న్మూలక దుఃఖజాలమును బొంది నశించెదు నీదుతెల్వి చాల్।
చాలును శూలి వేఁడుకొని శాశ్వతసౌఖ్యముఁ జెందు చిత్తమా॥

ఉ॥ గోటను జీరఁగల్గు నది గొడ్డఁటఁ జీరఁగ నెంచి కర్మముల్।
గోటులు జేసి జన్మతతిఁ గూలఁగ నేలనె భక్తకల్పకో।
త్పాటన దక్షు, దక్షసుతభర్తను సూటిగ నమ్మితేని యీ।
పాటు లొసంగుసంభవము భస్మముగాదె తలంచు చిత్తమా॥ ౪౬.

చ॥ కతకము పంకమిశ్రమగుకంబు, వినిర్గతకల్మషంబుగా।
నతిసులభంబు జేయునటు లంతకవైరిపదాబ్జభక్తి, ని।
శ్చితముగఁ గర్మపంకమునఁ జిక్కిన నిన్నొడలించుఁ గాన నా।
తతమగుభక్తితోడ నగధన్వి సపర్య లొనర్పు చిత్తమా॥ ౪౭.

ఉ॥ దీనులఁ బెంతు, దుష్టులను ద్రెంచెద, నిట్లని తెల్పుతీరునన్।
బూనిక నేణశాబకము మున్నొనవాలుఁ గరద్వయంబునన్।
బూను, కపాలమాల్యధరు మోహమున న్భజియించి, తద్దయన్।
మానుగఁ గాంచుసాధనము, మానక యెప్పుడు సల్పు చిత్తమా॥

చ॥ సరసిజనేత్ర వాల్గనులు సారసము ల్పవడంబు మోవియున్।
సరసిజమాస్యమంచుఁ దమిజాంగలమస్థులు రక్తనాళముల్।
నరములు జర్మము న్గలుగు నశ్వరదేహముపైని భ్రాంతులన్।
సరగఁ ద్యజించి, తెల్విఁ గొని, శాశ్వతు నీశునిఁ జేరు చిత్తమా॥

చ॥ కలియుగమందు సుస్థిరులకుఁ గానఁగరాదు శివుండు గాన ని।
ష్ఫలమగు నూత్నదేహతను బాయఁగ జేసియు నర్థవర్గమున్।
గలుగు నుపాయయుక్తమగు కాయ మొసంగిన మాతయే హరుం।
డిల యని నమ్మి సంతతము నీశ్వరు వేడ్కొనియాడు చిత్తమా॥ ౫౦.

చ॥ రవివెలుఁగంగ దీపముఁ గరంబున బట్టుట వెఱ్ఱిగాదొకో।
ప్రవిమలమోక్షదాయకుఁడు పాపమహా వనదావకీలియౌ।
శివుఁడు జెలంగ, నన్యసురసేవల లాభ మొకింత లేదటం।
చవిరళభక్తి నాశివుని, యర్చనఁజేసి తరించు చిత్తమా॥ ౫౧.

చ॥ పలుమఱుఁ దిన్నయింట గలవాసము లెన్నఁగ యుక్తమౌనె ని।
న్నెలువ మెలర్ప మానవునిఁ జేసి యఖండితమైన బుద్ధియున్।
దెలివి నొసంగు నీశ్వరుని దేవుఁడటంచు భజింపుమన్న నీ।
వలమటఁ జెంది మాలెదవహా! యిది కూడదు నీకుఁ జిత్తమా॥ ౫౨.

చ॥ ఇది విజనస్థలంబగుట నిచ్చట నే నిక నేమిజేసినన్।
విదితముగాదటంచుఁ గడువెంగలివై యఘమేలజేసెదే।
యదనున సర్వసాక్షియగు నాహరుఁడే నినుఁ జూచుఁ గావునన్।
బదిలముసుమ్ము పాపరతిఁ బాసి భవు న్భజియింపు చిత్తమా॥ ౪౩.

శా॥ శారే లోకమునందు వారు, మనుజు, లార్యార్థులైయుండరే?।
రారే నీవును జీరలాభముఁ గొన బ్రతిమాలని న్వేడరే।
వారెట్లో కన, నీకుచుట్టము లటు ల్వర్తిల్ల, నవ్వారికై।
నారై కుంది నశింప కీవ్రు గిరిశు న్భావించుమా చిత్తమా॥ ౪౪.

శా॥ నీవే కారణ మీజగత్స్థితులకు, న్నీకట్లు కాదీ జగం।
జీవాళ్యార్థము రూఢిగా నరసి నిన్నెంతేని బాధించు నీ।
భావాళి న్భవదీయమూలమని నీభావంబున న్జింతచే।
నావాని న్గన గుందనేల భవు వే యర్చింపుమా చిత్తమా॥ ౪౫.

ఉ॥ మాయది మాకొసంగుటయె మళ్లను మాన్య మొసంగునట్లు నాఁ।
దోయముల న్ఫలంబులను దుంపలఁబూలను వాని స్రష్టయౌ।
పాయక పంచశాఖికి నొసంగఁగఁ దావక సర్వవిత్తమున్।
బాయునె వారినేనిఁ దగుభక్తి మహేశున కిమ్ము చిత్తమా॥ ౪౬.

చ॥ తనకును గానిధర్మములు తథ్యముగా భువి లేవు మంచిదే।
యనిశము నీవుగూర్చు కుసుమాళుల నీ నడునెత్తిమీఁద సాం।
పున ధరియించఁగా మిగుల బువ్వులనేసియుఁ జంద్రశేఖరా।
ర్చనకయి కాళ్లఁ ద్రొక్కక యొసంగిన నంతియచాలుఁ జిత్తమా॥

చ॥ కలగను నర్థము ల్నిజముగా విలసిల్లునె? మేలుకాంచినన్।
జెలువుగ నైంద్రజాలికుఁడు జేసెడు గారడియెల్ల సత్యమే?।
వలనుగ నట్లె యీజగము వర్తిలుట న్దెలియంగరాదొకో।
తెలిసియు సత్యమౌ హరునిఁ దెల్పని వేఁడఁగరాదె చిత్తమా॥ ౪౮.

ఉ॥ దీపము లేక చీకటిని దృగ్యుతుఁడైనను జూడఁగల్గునే!
దాపుల వెన్నియున్న వసుధారథు నానతి యింత లేకనే।
యోపునె సిద్ధిఁ గాంచ? నరుఁ డుద్యమసంపదఁ, గాన సర్వమిం।
కేపరితాపము న్బొగల కీశు నధీనముఁ జేయు చిత్తమా॥ ౫౯.

చ॥ కడవెడు పాలనైన విరుగంగ నొనర్చదె చల్ల చుక్క? యా।
వడువున సద్గుణాళి చెడుఁ బాపగుణంబునఁ, గాన దాని నె।
ప్పుడు నినుఁ జేరనీక, నతపోషుని మంగళశుభ్రవేషున।
య్యుడుపతిభూషు వేఁడుము, సుఖోన్నతిఁ గాంచెదు నీవు చిత్తమా॥

చ॥ ఒకయల పోవ నింకొకటి యుబ్బుచునే కనుపట్టుమాడ్కిఁ, గో।
రిక వెనువెంటఁ బుట్టు దరిలేని మనోరథసంచయంబు, నీ।
కిక పరితుష్టి యెన్నటికి? నెట్టులఁ జేకుఱుఁ? గాన తన్నివృ।
త్తికయి సహస్రకోటి రవిదీధితు నీశు భజింపు చిత్తమా॥ ౬౧.

ఉ॥ చంకను మేకపిల్లఁ గనఁజాలక యేడ్చెడు గొల్లమాడ్కి ని।
శ్శంకముగాఁగ నాత్మవిలసచ్ఛివుఁ గానక యెంతయు న్మహా।
సంకట సంకులాద్రి వనసంతతిఁ గ్రుమ్మరనేల? సర్వగున్,।
శంకరు, మానసాంబురుహ సంస్థితు, నమ్మి భజింపు చిత్తమా॥ ౬౨.

చ॥ ధర సుఖమన్న సున్నయని తద్దయు బాములఁ బల్కి, దానినే।
మరలఁ గొనంగ యత్నముల మందమతి న్బొనరించఁబోవు, నీ।
చరితము, నక్కతేల యనుసామెతఁ, దథ్యముగాఁగఁ జేసెదున్।
బరువడి యట్టిభ్రాంతులను బాసి భవు న్భజియింపు చిత్తమా॥ ౬౩.

ఉ॥ కుక్కకు సింహవేషమును గూర్పఁ దదీయ గభీరనాదమే।
చక్కనిఁ జేయనోపు? నటు చంచలవానరయోగ్యమైన ని।
న్నుక్కున మానుషాంగమున నుంచినఁ దోడనె లాభమేమి? యా।
చక్కని తెల్వి నిమ్మనుచు శర్వునిఁ బ్రార్థనఁ జేయు చిత్తమా॥ ౬౪.

ఉ॥ రోగి కపథ్యవస్తువులు రుచ్యములై కనుపట్టి, రోగముల్।
బాగుగఁ బెంచి చంపుగతి బంధురసంసృతి రుగ్ణమర్త్యులన్।
నాగవిభంజనేతర వినాశకరార్థము లీల్గఁ జేయు, నీ।
వాగతి నెంచి, భక్తిఁ గొనియాడి శివు, న్శుభమందు చిత్తమా॥

చ॥ అమృతముకై సముద్రము సురాసురవర్గము ద్రచ్చుకాలమం।
దమితమనోవ్యథ న్జగములంపఁగ రేఁగువిషార్తి బాపి, య।
క్కమలజ మాధవాదులను గాచినజెట్టి శివుండు, వాని నీ।
వమలమతి న్భజింపు, మతఁ డన్నిఁట నన్నియు నీకుఁ జిత్తమా॥ ౧౬.

ఉ॥ ఇంటికి నిప్పువెట్టుకొని యెంతయు గో నిదురించుమాడ్కిన్, ని।
న్నంటి చరించి, కాలమున హాస్యముపాలుగ నిన్నునర్చు, నీ।
తుంటరియైన కామ్యములఁ దొట్టి, తుది న్వగలంగనేల? ము।
క్కంటిపదమ్ము ముందుగనె గాంచవె యొప్ప భజింపు చిత్తమా॥ ౧౭.

చ॥ అడిగినఁగాని బిడ్డలకు నమ్మయుఁ బెట్టదుగా ధరిత్రి? నీ।
శుఁ డన జగత్కుటుంబిగద? సూటిగ నిన్ను దలంచు టెట్లు? నీ।
వెడలని భక్తితోడుత నొకించుక ప్రార్థనఁ జేయకుండినన్।
గడఁగి తదీయసత్కృపను గాంచఁగ లేవు తలంచు చిత్తమా॥ ౧౮.

ఉ॥ భారతి బుద్ధియు, న్భుజగభర్తముఖాంబులు వేయుగల్గినన్।
బారములేని నీసుగుణవర్గములో నొకయంశమేనియున్।
నేరనుతింప, నేగతిని నేర్తును సంసృతి మోహపాశ సం।
భార వికారబుద్ధిననని, భర్గునితో వడిఁ బల్కు చిత్తమా॥ ౧౯.

ఉ॥ ఎప్పుడు సత్తుగో తెలియ నెవరికి శక్యముకాదు, దానికై।
ముప్పుల గుందియైన వెత మూల్గుచునైనఁ జలంబు రెట్టిగా।
నప్పటిలంగఁ బెంచెదు, ముహూర్తముమాత్రము నీవశంబొకో।
చెప్పెడిదేమి యీశ్వరు భజింపుము రోసముఁబాసి చిత్తమా॥ ౨౦.

చ॥ మనమున దుష్టవృత్తులను మాన్పఁగ యత్నము సల్ప క, న్నిటిన్।
బనిఁ గొని పెంచి, దాసుఁడయి, వానికిఁ గోల్పడె సర్వసంపదల్,।
దనయులఁ, దమ్ముల, న్హితులఁ, దన్ను, సుయోధను నంత వాఁడు, వ।
ర్తనమున నీవటు ల్జెడక, రాజవిభూషితుఁ గొల్వు చిత్తమా॥ ౨౧.

ఉ॥ గానమునందు లోలుపతఁ జేసి మృగంబులు వేఁటకానిచే।
గాననమందుఁ బట్టువడి గాసిలుఁ. గావున నిష్టయోజక।
స్థానమటంచు దుర్వ్యసనసక్తిఁ దొరంగి, నతార్తరక్షణా।
ధీనుని నందియానునగధీరుని నీశ్వరు వేఁడు చిత్తమా॥ ౨౨.

చ॥ కలిగినయాకుల న్దినుచుఁ గాలమెఱింగెడు యోగికైవడిన్।
వలనుగ నంతమందు నొకపట్టున నిల్చియు, వి.....త్తి వేచి, యా।
కులఁ దినమెల్లమి న్మిడుకు గొంగళిపుర్వు తెఱంగెఱింగి, వాం।
ఛల దుదిమైనఁ బాసి, హరుసన్నిధిఁ జేరఁగఁ గోరు చిత్తమా॥ ౨౩.

మ॥ ఉపయోక్తాత్మబలంబు పెర్గి సకలం బుత్కృష్టత న్గాంచెదున్।
నిపుణుండౌ భిషజుండు వెట్ట విషము న్నిక్కంబు పీయూషమా।
గృప న న్సత్కృతులం దమర్చినను దుష్కృత్యంబులం దుంచినన్।
ద్విపరక్షోహర నీదె భారమనుమా ఘీమేశుతోఁ జిత్తమా॥ ౨౪.

చ॥ ముదుసలి నైతి నేచనిన ముం దెటులుంపురో? యాలుబిడ్డలున్।
బదిలము జేసి యిడ్డ ధనభాండములన్నియుఁ బాడుచేతురో?।
వదలను జీవమంచుఁ గడవందిన నారునె తాపసంఘముల్?।
మదనహరాంఘ్రిభావనల మానుగ శాంతిలుఁగాక చిత్తమా॥ ౨౫.

ఉ॥ పావల నెక్కి క్రుమ్మరెడు పాదమునందున ముండ్లు దూరునే?।
భావజవైరి పత్కమల భక్తియుతుం డటు, జన్మకోటి దుః।
ఖావహకర్మబంధముల నన్నిదొరంగియు సుప్రసిద్ధమా।
శైవపదంబునందు నని శంకరుభక్తి భజింపు చిత్తమా॥ ౨౬

చ॥ పలలముఁ దింటిమంచు మెడ వైతురె దుష్ముల నెవ్వ రేని లో।
పలఁ గలవృత్తు లెట్లయిన, బైట ననిందితవర్తనంబుతో।
మెలఁగిన నీదు చూపఱకు మేలు, క్రమంబుగ నీకు లగ్గగుఁ,।
జిలువలఱేనితాలుపుని జేర నొకప్పుడు గల్గుఁ జిత్తమా॥ ౭౭.

చ॥ కులమున పెద్దయైన, నలకూబరుఁబోని శుభాంగుఁడైన, ని।
శ్చలమగుసంపద న్ధనదసన్నిభుఁడైన, సమస్తవిద్యలుఁ।
జెలఁగిన, నన్నియు న్విబుధసేవిత శంకరు భక్తిలేక ని।
ష్ఫలములు, సానక్రింద నిడు వన్నియ, లంచుఁ దలంచు చిత్తమా॥

చ॥ తొలుతను లేనిచింత, యది దోచినఁ బిమ్మట దాని రూఢిగా।
నిలుపఁగఁ జింత, నిల్చినను నిత్యము దానిని బెంచు చింతయుఁ,।
బలముగ దానిఁ బెంచినను బాయఁగఁజాలని చింతయుంత మం,।
దలవియె చింతలం దొరుఁగ నాహరు సత్కృపలేక చిత్తమా॥ ౭౯.

ఉ॥ ఎవ్వనియందు, దృశ్యమగు నీజగ ముద్భవమంది లీనమౌ।
నెవ్వఁడు సర్వభూతహితుఁ డెవ్వఁడు బుట్టఁడు నీల్గకుండునో।
యెవ్వఁడు సూక్ష్మసూక్ష్మతరుఁ డెవ్వఁ డజేయుఁడు నప్రమేయుఁడో।
యెవ్వఁడు సర్వసాక్షి యతఁ డీశుఁడుసుమ్ము భజింపు చిత్తమా॥ ౮౦.

ఉ॥ దూరపుకొండ నిద్దముగఁ దోచియు జెంతకుఁ బోవఁ బోవఁగాఁ।
జేర నశక్యమౌనటులఁ జేకురునంతకు నర్థము ల్సుఖా।
ధారము లట్లగన్పడి, పదంపడి తాపముఁ బెంచు, వాని ని।
స్సారము లంచు నెంచి హరిసాయకు నెప్డుఁ దలంచు చిత్తమా॥

చ॥ విమలజలంబుల న్ద్యుమణిబింబము దోఁచెడురీతిఁ బంకనీ।
రములఁ జెలంగునే? యటుల రాగనివిష్టవిమూఢమానసుల్।
యమదము తత్వము న్దెలియ నర్హులుగారు, తలంచు, రాగముఁ।
మమతయు వీడకున్న శశిమండను గాంచ దలంచెదే? చిత్తమా॥

ఉ॥ కామమె సర్వకర్మతతి కారణ, మార్జిత కర్మసంతతిన్।
వేమరు దేహి బుట్టు, నట వృద్ధియె కాంచెడు కర్మమట్లుగాన్।
నేమము కామమూలమునఁ జేకురుచున్నఁడుఁ గల్లబోదు, ని।
ష్కామత నీశుసేవనము శస్యతమంబని నమ్ము చిత్తమా॥ ౮౩.

ఉ॥ ధర్మమె సర్వయాగములు, ధర్మమె సర్వజపాగ్నిహోత్రముల్।
ధర్మమె సర్వదానములు, ధర్మమె జూవె సమస్తతీర్థముల్।
ధర్మమునందు సర్వమును దద్ద్రప్రతిష్ఠిత మయ్యెఁ గాన, స।
ద్ధర్మమె శూలి సత్కృపకుఁ దథ్యము మూలముసుమ్ము చిత్తమా॥

ఉ॥ ఏనతిదుష్టకర్ముఁడ ననేకవిధాగము లాచరించితిన్।
నా నడత న్దలంచుకొన నాకె యసహ్యమటంచు నిష్పృహన్।
బూనకు, మెప్పు దేమనినఁ, బ్రోచును దప్పక నిట్టిదుష్టు నీ।
శానుఁడు నుంత యేనియు నిజమ్ముగ నమ్మినవానిఁ జిత్తమా॥ ౮౫.

ఉ॥ దేవమహానుభావ, హర, దివ్యనదీచలదూర్మి నిర్గమ।
త్పావన శీకరార్ద్ర శశిభాసుర శేఖర, నీలకంఠ, దుః।
ఖావహ ఘోరసంసృతి మహాంబుధితారణ ముఖ్యకారణా,।
కావుము కావుమంచు శితికంఠుని వేఁడు తరింతు చిత్తమా॥ ౮౬.

ఉ॥ ఎట్లుగ భుక్తదత్తఫల మిమ్మహివిత్తము, దారసంగ్రహం।
బెట్లు ప్రజాఫలంబు, సభ లెన్నఁగ వాదము సేయఁజాలుటే।
యెట్లు ఫలంబు శాస్త్రమున, కెట్లుపకారఫలంబు శక్తియా,।
నట్లు మనుష్యజన్మఫల మాహరపూజయెసుమ్ము చిత్తమా॥ ౮౭.

ఉ॥ ఎందుకుఁగాని ఘోరమగు నేవపుఁ గర్మలఁ జేసి, వానికై।
కందుచుఁ జిన్ననాఁడె ముదుకందుల చిన్నియ లంగకంబులన్।
నందడి జేయ నెందులను శాంతి దలిర్చక చచ్చె దీవయో।
యెందును మొక్కవోని పరమేశ్వరభక్తి గడించు చిత్తమా॥ ౮౮.

ఉ॥ ఏమని విన్నవింతుఁ బరమేశ్వర షడ్రిపుఘోరకృత్యముల్।
నేమము దప్పఁగా నిడెను, నిష్ఠఁ గలంచెడుఁ, బుణ్యచింతకుల్।
నామము వెట్టు, నే పరుసున న్భరియించెద? నీవెఱుంగవే।
కామవిరోధి! న న్గరుణఁ గావుమటంచు వచింపు చిత్తమా॥ ౮౯.

ఉ॥ అంతరవృత్తిబోధ, విటపావళియత్నము, కర్మజాత జా।
న్మాంతరకోటులు స్థలము, లాభవశాఖకి, నందు మోహముల్।
వింతగుతోట్టిఁ, దాపఘణివేచి నిను న్దెగటార్చు, దాని నా।
వంతయు మేలులేను సురసాదపమా శివు నమ్ము చిత్తమా॥ ౯౦.

ఉ॥ నేతిని బూదివేల్చుట వినిందితదానము, శ్రోత్రిచేతిలో।
శాతకృపాణముంచుట యసాధులఁ బెద్దలసేఁత, గావునన్।
బ్రీతిగ సాధుమన్ననలఁ బెంపువహించుచు యోగ్యదానముల్।
ఖ్యాతిగ సల్పి యీశుఁగృపఁ గాంచఁగ నెప్పుడుఁ గోరు చిత్తమా॥

చ॥ అసితవిహంగ మెట్టు లుసితాండము వెట్టును? రొంపిలోన నా।
రస మెటు పుట్టు? నక్కరణి రాగవిరోధము లావహించు మా।
నసము నతీతభావను సనాతను శంకరుఁ బట్టనొప్పు, వా।
సి సతతభక్తిఁ గొల్వ, నిది నిక్కము, సుమ్మటులెమ్ము చిత్తమా॥

చ॥ పొలమునఁ బడ్డవస్తువులు ప్రొయ్యికులంగటఁ గాంచరానటుల్।
బలముగ నన్నిశాస్త్రములఁ బాఠముజేసిన సందియంబులున్।
దొలఁగునె? యాత్మబోధమునఁ ద్రుంగెడుఁ గావున, శాస్త్రఘోషచే।
నలయక, స్వానుభూతి పథమందఁగ శంకరుఁ గొల్వు చిత్తమా॥

ఉ॥ ఏల సృజించె నబ్జభవుఁ డీనయహీనుని? వీఁడు సచ్చినన్।
మేలగుఁగాక సాధుయుత మేదిని కంచు, జనాళికోర్కి యే।
మూలము గాన దుర్గతికి, భూప్రజ కింపుగ నాచరించినన్।
శూలిమనంబు మోదమునఁ జొక్కెడు, నట్టు లొనర్పు చిత్తమా॥

ఉ॥ ఎట్టియఘంబొనర్చితినొ యే దొలిబాముల నిట్టిదుఃఖ మి।
పుట్టువునందుఁ గల్గెనని, బుద్ధిని యోజనఁజేసి, సాధ్యమౌ।
మట్టుకుఁ బాపకృత్యములు మాని, యసాధ్యములైన దుష్కృతుల్।
నెట్టుమటంచు నీశ్వరుని నిర్మలబుద్ధి భజింపు చిత్తమా॥ ౯౫.

చ॥ "పశుపతయే నమోదహన భాస్కరశీతకరాంబకాయతే।
శశిధరమండనాయ శ్రుతిసార పరిస్తుతవైభవాయ పు।
ష్పశరహరాయ భక్తజనపాలన తత్పరమానసాయ వా।
ర్ధిశరధయే మృడాయ మహతే" యని పల్కుచునుండు చిత్తమా॥

మ॥ "రజతాద్రౌ కమనీయకాంచనమణి ప్రాసాదరమ్యస్థలే।
గజవైర్యాసనసంస్థితం గిరిజయాగాఢం సమాలింగితం।
ద్విజభూషం సురనాథసంయమినుతం వేదాంతవేద్యం శివం।
భజనీయం శరణం వ్రజామి" యను మాపల్మాఱులో చిత్తమా॥

మ॥ ధనమా లేదు, వివాహమా నహి, పరార్థజ్ఞానమా సున్న, జీ।
వనమా కోకిలపిల్లలట్ల, జపమా పాండిత్యమా నాస్తి, పా।
వనమౌ శంభునినామము న్దలఁపమి న్వ్యర్థంబులౌ మేనులన్।
ఘనతుష్టి న్మనజూతు, వింత లగునీకర్మంబులో చిత్తమా॥ ౯౮.

చ॥ ధనికుల హీనమానవులఁ దండ్రియనన్వలె బొట్టకోసమై।
యనయము దృష్టిభావముల నారసి తెల్వి మెలంగఁగావలెన్।
ఘనమని దీనికీకొనెదు, కామహరు న్భజియింపఁ గష్టమం।
చనెద విదేటికర్మ మహహా! శివుఁ డివ్వఁడె నీకుఁ జిత్తమా॥ ౯౯.

ఉ॥ ఎంతధనంబు జేకుఱిన, నింద్రపదంబు లభించెనేనియున్।
గంతు జనింపఁగల్గు సురకాంతల కౌగిలి సౌఖ్యమబ్బినన్।
బ్బంతులఁబోల్కి నీభువనపఙ్క్తులఁ గేల నమర్చఁగల్గినన్।
సంతసముండునే శివుని సంస్మరణమ్మున యట్లు? చిత్తమా॥ ౧౦౦

ఉ॥ శంకర నిన్ను వేదములు సర్వసమర్థుఁడవంచు బల్కుటల్।
బొంకుగఁ దోఁచు, నేమనిన, ముజ్జగము ల్త్రుటిగెల్వఁజాలు నీ।
బింకము నన్ను నీవశము ప్రేల్మిడి జేయఁగఁ జాలదంచు నీ।
వింక వచింప దోసమె? మహేశునితో నవివేక చిత్తమా॥ ౧౦౧.

ఉ॥ ఇంతటిదానవంచు నిను నెంచ నశక్యము, జూడ నెట్టిధీ।
మంతులనేని దాసులుగ మార్చఁగఁ గల్గుదు, నిన్ను దైవమం।
చెంతును, నాదుప్రార్థనల నించుక మన్ననఁజేసి, శంకరున్।
సంతస మొప్పఁ గొల్చుటకుఁ జయ్యన నానతి నిమ్ము చిత్తమా॥

ఉ॥ జ్ఞానము నీకుఁ గద్దనుచుఁ జయ్యన కర్మము వీడఁబోకు, వై।
శ్వానరుఁ డూటఁ గాల్చుననువాక్య మెఱింగినఁ గాలకుండునే?।
పూసిక వానిచెంతకును బోవమి మానెడుఁగాక, యీశ్వరా।
ధీనముగాఁగఁ గర్మములఁ దెల్విగ సల్పుటె యొప్పుఁ జిత్తమా॥

చ॥ జతనము నీవు సల్పినను, సల్పకయున్నను, లోకమందు సం।
గతులకు మార్పు లేదనుట కాలమె తెల్పు ఋతుప్రయుక్తిచే।
నతిఘనత న్వహింతునని, యల్పతతోడను గర్వివై వృథా।
పతనము జెందెదేల? శివుభవ్యముకై భజయింపు చిత్తమా॥ ౧౦౪.

చ॥ దినకరుకాంతి యిందు నిజతేజముగాఁ గనుపట్టుమాడ్కి, నీ।
శుని ఘనశక్తి యెల్లెడల శుద్ధిగ వెల్గఁగ, దానిఁ దెల్వియో।
కనుఁగొనలేక, వేఱ యొకకారణ ముండునటంచు నన్యులన్।
వినుతులు సేతు, దూరెదు, వివేకమ యిద్ది? తలంచు చిత్తమా॥

ఉ॥ హీనపుయోనులందు జనియించి, తుది న్నిజపుణ్యకర్మ సం।
భావితమర్త్యుఁడై, భవగుణంబుల ద్రుంచఁగఁజాలు యత్నమున్।
బూనక, నీశు వేఁడకను, బుల్లయ వేమ వరంబురీతి మున్।
దా [illegible] లట్ల కుహాఘుఁడయి తప్లట శోచ్యముకాదె? చిత్తమా॥

ఉ॥ పావన బుద్ధిరాజ కులపాలితుఁ డన్నమరాజభక్తి లో।
కావళికి న్హితంబుగ శివార్పణమంచు రచించె దీని స।
ద్భావముతోఁ బఠింప వినఁ బామరుఁడైన నఘాళి దూలఁగా।
నావల ముక్తిఁజెందెడు యథార్థముగా శివునాజ్ఞ చిత్తమా॥ ౧౦౭.

ఉ॥ "మంగళమభ్రకేశ, తవమంగళమస్తునతామరేశ, శు।
భ్రాంగనిరస్తకాశ, భవబంధవినాశ, తుషారశైలరా।
డంగసముద్భవేశ, గళితాంతకపాశితలస్థపాశ, స।
త్సంగధృతోరగేశ, యని చాటుచు నెప్పుడుఁ బాడు చిత్తమా॥

---

PRINTED AT THE VAIJAYANTI PRESS, 32, MOUNT R

ఓమ్.

శ్రీసద్గురుపరబ్రహ్మణేనమః.



# యోగనిద్రాశతకము.

అను పద్యములున్ను,

## సచ్చిదానందప్రకాశిక,

అను తత్వజ్ఞాన సంకీర్తనములు.

ఇది,


వంగల-వీరభద్రదాసుచే

రచియింపంబడి





టి- చెంగల్వరాయనాయుడు

అండుసన్సువారి స్వకీయ,

మురహరిముద్రాక్షరశాలయందు

ముద్రించిప్రచురింపఁబడియె.

చెన్నపట్టణం.

**1909**



## శ్లోకము.



తత్వామృతానంద ఫలప్రదాయనమ్।
వేదాంతవిజ్ఞాన సుగంధపుష్పం।
యత్సారభూతం తదుపాశితవ్యమ్।
హంసోయథాక్షీర పివాంబుమిస్రం॥

ఓమ్.

# సచ్చిదానందప్రకాశికయొక్క,

# విజ్ఞాపనము.



౧. వేదాంత ప్రవర్తకులగు సుజ్ఞానులారా! నిర్గుణ సాక్షాత్కార పరబ్రహ్మస్వరూపమునందు మాయాశక్తియుండును. అది యమూలప్రకృతి, ఈమాయత్రిగుణాత్మిక యిది వచ్చినతోడనే నిర్గుణబ్రహ్మముకు సగుణబ్రహ్మమని జెప్పవలసివచ్చెను. దీనియందు అవ్యక్తము,అందుమహత్తత్వము, అందు అహంకారము దీనివలన శబ్దస్పర్శరూపరస గంధంబులనియెడు పంచతన్మాత్రలు, ఈపంచతన్మాత్రలవలన పృధివ్యాపస్తేజో వాయువాకాశంబులనియెడు పంచభూతంబులు, ఆ పంచభూతములయొక్క అన్యోన్య సమ్మేళనమువలన సమస్త జగత్తు మేర్పడెను.

౨. అట్టిజగత్తులో ౧ జరాయుజములు ౨ అండజములు ౩ స్వేదజములు ౪ ఉద్భిజములుగా జన్మములుకల్గెను, జరాయుజములలో మానుషజన్మంబు దుర్లభంబు, అందు బురుషత్వంబు మిక్కిలిదుర్లభంబు. గనుక జన్మముగల్గినందుకు ప్రతిమనుజుడు జ్ఞానమునుసంపాదించుటకంటె యితరసుఖంబు లేమి,

న్ని లేదు. జ్ఞానములేనివాఁడు పశువుతో సమానుడు, గనుక బ్రహ్మజ్ఞానమును పొందుటకు వేదాంతగ్రంథములను విమర్శించవలెను. అటుపిమ్మట గురుసేవయు, అందువలన యీశ్వరభక్తి విషయవైరాగ్యముజీవకారుణ్యముమొదలగు సద్గుణములు గల్గును, వైరాగ్యమువలన దారాపుత్రాదులయందు ప్రేమనశించును, అప్పుడు జితేంద్రియత్వమును తత్వజ్ఞానమును స్థిరపడును, అట్టిజ్ఞానమువలన జీవన్ముక్తిగల్గును.

౩. ఈగ్రంథకర్తగారైన వంగల-వీరభద్రదాసుగారికి నేటివరకు ౫౦ సంవత్సరంబులు, ఇందుబాల్యయౌవన కౌమారవయో విశేషంబుల ౪౦ వర్షంబులుగడచె. అప్పటికి వీరు శాస్త్రవాసనగాని, కవితాధోరణిమొదలగునవిగాని యెంతమాత్రమునెరుంగరు, తదుపరి జన్మభూమియైన నంబూరను స్వగ్రామంబునకుజేరి సోదరపోషణవిచారముచే లోకవాసనతో కర్మంబులుకొన్ని మదినిడుకొని ప్రవర్తించుచుండెను. ఇట్లుండగా ఆగామిసంచిత ప్రారబ్ధమనెడి అజ్ఞానమునశించి జ్ఞానమోక్షాపేక్షుఁడై నిరంతరము సత్సాంగత్యము జేయుచు సద్గురుకటాక్షముచే యోగాభ్యాసక్తుడై శ్రీసచ్చిదానందసర్వపరిపూర్ణ పరబ్రహ్మంబును మనంబునందలంచి తానుగనుంగొనిన స్వరూపంబులనుబట్టి అనుభవముచే యీ గ్రంథమునురచించి సచ్చిదానందస్వరూపునికి సమర్పించెను. యీ గ్రంథంబులోనిసంగతులు గురుసేవచే అనుభవముచేగ్రహిం

చినయెడల అజ్ఞానాంధకారము నశించి జ్ఞాననేత్రమును బ్రహ్మజ్ఞానమనెడి కాటుకతో తెరవబడుచున్నదిగా కనుపడుతుంది. యీగ్రంథమునందు గీతకందశతకద్వయంబులు తత్వములు మొదలగునవి శేర్చియున్నారు, ఇందులో కొన్నిపద్యములయందు లక్షణదోషంబులుండినను సైనుదహరించిన కాలములవల్ల సుజనులు దోషములను బోవిడిచి గుణములున్నయెడల వ్వానికి మాత్రము సంతసించగోరెదను. యీగ్రంథ స్వభావమనోహర్య మెందునుంగానరాదని నిస్సందేహముగా జెప్పవచ్చును. యీగ్రంథకర్తకు తనగ్రంథమూలకముగా దననామము నాచంద్రార్క స్థాయిగాజేయుటకు భగవంతుని ప్రార్థించుచున్నాను. ఇదిసర్వజనాంగీకృత మగుగాత. ఈగ్రంథమును కాపివ్రాసిన నంబూరు-లక్ష్మీనారాయణ శర్మగారికుమారుడు వెంకటసుబ్బయ్య యున్ను, గ్రంధి- వెంకటసుబ్బరాయగుప్తయున్ను, గ్రంథకర్తగారికి సహాయముచేసినందుకు సచ్చిదానందస్వరూపుడు మేలుచేయుగాత.

ఇట్లు,

సాధుజనవిధేయుడు-

నంబూరు- లక్ష్మయ్యగారికుమారుడు,

వెంకటసుబ్బయ్య.



శ్రీరామజయం.



శ్రీసద్గురుపరబ్రహ్మణేనమః.

# యోగనిద్రాశతకము.



శ్రీ నిరాకారుఁడైనట్టి, చిత్ప్రకాశు
పరమపదమందునిలచిన, పరమహంసు
సురుచిరంబుగ సేవించు, సుస్థిరముగ
నోఁవీరభద్ర, యోగనిద్రా॥ ౧

గీ॥ సచ్చిదానందుఁడైనట్టి, సద్గురువరు
చరణములపూజసల్పియు, సంతసమున
సకలతత్వార్థములజెప్పు, సంగ్రహముగ
యోరివీరభద్ర, యోగనిద్రా॥ ౨

గీ॥ గురుపదములపూజ, గురుతుగాఁజేసియు
వెరుపులేకమనసు, మరుపుఁదలఁచి
పరగహానిలేదు, పరతత్వమంచున- యోరి॥ ౩

గీ॥ అజ్ఞానమునఁనీవు, నంతయుఁదొలిగియు
సుజ్ఞానమతితోడ, చూచెనేని
బ్రహ్మంబువేడుక, బయలందిచూడరా- యోరి॥ ౪

గీ॥ వంటిగానున్నది, వోరుపుతోడను
దంటలేదుదాని, తరచిచూడ
అంటీఅంటకనెపుడు, అంతటతానయ్యె- యోరి॥ ౫

# యోగనిద్రాశతకము.

గీ॥ వూరువూరునడుమ । వున్నదివాకకోటి
పారజూడముక్తి । పదముగాక
వేరుపడకనీవు । విధమునసేవించు- యోగి॥ ౬

గీ॥ యెప్పుడుతనలోన । తప్పకజూచితే
ఒప్పుగానుమనసు । యుండుగాని
గొప్పనైనదాని । కొండెక్కిచూడరా- యోగి॥ ౭

గీ॥ మూలమందుబుట్టె । ముగ్గురుమూర్తులు
మూలమందుగలిసె । మొదటియుగకి
మూలంబులోసర్వ । ముఖ్యంబుగనుమిక- యోగి॥ ౮

గీ॥ దేహంబులోపల । తేజంబుదాగుంది
దేహంబులోచూడు । తెలివిచేత
దేహగుణములణచి । తేటగానిలువుము- యోగి॥ ౯

గీ॥ దేహమాద్యంతంబు । తిరుగుచుండేదాని
తెలివిచెడకనీవు । దివ్యముగను
తారుమారుగాక । తనువునజూడుము- యోగి॥ ౧౦

గీ॥ అయిదొక్కటిగజేశి । ఆరింటపైనెక్కు
వేరులేదుదాని । మారులేదు
పోరులణచిచూడు । పొందుగానిప్పుడు- యోగి॥ ౧౧

గీ॥ చీకటినున్నది । చిద్విలాసంబంత
చీకటిలోచిక్కు । చిక్కబోకు
చీకటిలోనున్న । చిన్మయుజూడరా- యోగి॥ ౧౨

గీ॥ మాయతోనున్నది । మనసుయెల్లప్పుడు
మాయమనసులరెంటి । మర్మమెరిగి
మాయనుఖండించి । మరిసుఖమందరా- యోగి॥ ౧౩

గీ|| ఇహామునందుసుఖము ❘ యికనేమిలేదురా
పరమునందుసుఖము ❘ బడయవచ్చు
ఇహాపరములురెండు ❘ నెంచగాబంధమా- యోగి||

గీ|| నాలుగుఖండించి ❘ నాలుగుజేర్చుము
నాలుగులోపల ❘ నయముదెలిసి
నలువుతెలువుజేసి ❘ నాతిసిగనుగోను- యోగి|| ౧౫

గీ|| ఆరునుబట్టుక ❘ వారునుతెగవేయు
మారింటిలోదాని ❘ అంతుగనుము
వేరుపడకదినము ❘ విధమునసేవించు- యోగి|| ౧౬

గీ|| మనసుచిలుకజేసి ❘ మరితత్వమెల్లను
పలుకమనుచుగురుడు ❘ పట్టిచెప్పె
అట్టిపలుకులోన ❘ అఖండంబుగురువురా- యోగి|| ౧౭

గీ|| వాక్కునందుగురువు ❘ వాక్యార్థమునగురువు
మనసునందుగురుని ❘ మహిమగనియు
యెల్లదిక్కులందు ❘ నెంచినగురువురా- యోగి|| ౧౮

గీ|| పంచవర్ణంబులై ❘ పరగంగజీవాత్మ
పంచకర్తలనగ ❘ బరగఖ్యాతి
పంచపంచపంచప్ర ❘ పంచమైయుండె- యోగి|| ౧౯

గీ|| యేడిరాపరమాత్మ ❘ డెచ్చటసున్నాడు
వద్దనుండగాను ❘ వాదమేల
ముద్దలోననున్న ❘ మూలంబుచూడరా- యోగి|| ౨౦

గీ|| తిరిగితిరిగితిరిగి ❘ దిమ్మరిగాబోకు
తిరగకుండమనసు ❘ తిప్పిపెట్టి
పెట్టినతరువాత ❘ పెరలోనుండిరా- యోగి|| ౨౧

గీ॥ అందుయిందునందు । నఖిలంబుయొక్కచే
యెందులేదుదాని । నెంచిచూడ
పొందుగానుమనసు । వుంచియొగనుమిక-యోగి॥ ౨౨

గీ॥ మూడుగుణంబులు । ముదముతోగనుగొని
మూటిలోనమొద । లునికిదెలశి
మూటమీదసర్వ । ముఖ్యంబుగనుమిక- యోగి॥ ౨౩

గీ॥ గుణముగలిగనశిష్య । గురునిశేవించును
గుణహీనుడేమరుగు । గురుతుదారి
గుణముగలిగినజీవి । క్షణములోతెలుసురా- యోగి॥

గీ॥ అంతమందుచూపు । నభ్యాసమునుచేయ
ఆదిలోనవాని । యంతుదెలసు
వాదులాడబోకు । వట్టిమాటలతోను- యోగి॥ ౨౫

గీ॥ గుణముకుదిరేదనుక । గురునిశేవించుము
గుణముకుదిరినవెనుక । గురుతుజూడు
గురుతుజూచినవెనుక । కోరికల్విడువరా- యోగి॥

గీ॥ ఆధారమునదాని । ఆటదెలశయుకీవు
పశ్చిమవీధిలో । పరగనిలువు
బ్రహ్మంబువేడుక । బయలందిచూడరా-యోగి॥ ౨౭

గీ॥ నాదంబులోపుట్టె । నలుసైనయాబిందు
బిందువలోబుట్టె । పెద్దకళయు
నాదుబిందుకళల । నంటినమోక్షంబు- యోగి॥ ౨౮

గీ॥. దారపుత్రాదులు । దగిజేర్చలేరని
దండియైనగురువు । నండజేరి
నిండువున్నదిలోన । నిలచినముక్తిరా- యోగి॥ ౨౯

గీ॥ ఇహామునందుసుఖము । యికనేమిలేదురా
పరమునందుసుఖము । బడయవచ్చు
ఇహాపరములురెండు । నెంచగాబంధమా- యోగి॥
గీ॥ నాలుగుఖండించి । నాలుగుజేర్చుము
నాలుగులోపల । నయముదెలిశి
నలువుతెలువుజేశి । నాతిసిగనుగొను- యోగి॥ ౧౫
గీ॥ ఆరునుబట్టుక । వారునుతెగవేయు
మారింటిలోదాని । అంతుగనుము
వేరుపడకదినము । విధమునసేవించు- యోగి॥ ౧౬
గీ॥ మనసుచిలుకజేశి । మరితత్వమెల్లను
పలుకమనుచుగురుడు । పట్టిచెప్పె
అట్టిపలుకులోన । అఖిలంబుగురువురా- యోగి॥ ౧౭
గీ॥ వాక్కునందుగురువు । వాక్యార్థమునగురువు
మనసునందుగురుని । మహిమగనియు
యెల్లదిక్కులందు । నెంచినగురువురా- యోగి॥ ౧౮
గీ॥ పంచవర్ణంబులై । పరగంగజీవాత్మ
పంచకర్తలనగ । బరగఖ్యాతి
పంచపంచపంచప్ర । పంచమైయ్యుండె- యో॥ ౧౯
గీ॥ యేడిరాపరమాత్మ । డెచ్చటనున్నాడు
వద్దనుండగాను । వాదమేల
ముద్దలోననున్న । మూలంబుచూడరా- యోగి॥ ౨౦
గీ॥ తిరిగితిరిగితిరిగి । దిమ్మరిగాబోకు
తిరగకుండమనసు । తిప్పిపెట్టి
పెట్టినతరువాత । పెట్టెలోనుండిశా- యోగి॥ ౨౧

గీ॥ అందుయిందునందు । నఖిలంబుయొకఁటే
యెందులేదుదాని । నెంచిచూడ
పొందుగానుమనసు । వుంచియుగనుమిక-యోగి॥ ౨౨

గీ॥ మూడుగుణంబులు । ముదముతోఁగనుగొని
మూటిలోనమొద । లునికిఁదెలశి
మూటిమీదసర్వ । ముఖ్యంబుగనుమిక- యోగి॥ ౨౩

గీ॥ గుణముగలిగనశిష్యు । గురుని శేవించును
గుణహీనుడే మరుగు । గురుతుదారి
గుణముగలిగినజీవి । క్షణములో తెలుసురా- యోగి॥

గీ॥ అంతమందుచూవు । నభ్యాసమునుచేయ
ఆదిలోనవాని । యంతుదెలసు
వాదులాడబోకు । వట్టిమాటలతోను- యోగి॥ ౨౫

గీ॥ గుణముకుదిరేదనుక । గురుని శేవించుము
గుణము కుదిరినవెనుక । గురుతుజూడు
గురుతుజూచినవెనుక । కోరికల్ విడువరా- యోగి॥

గీ॥ ఆధారమునదాని । ఆటదెలశియుశీవు
పశ్చిమవీధిలో । పరగనిలువు
బ్రహ్మంబువేడుక । బయలందిచూడరా-యోగి॥ ౨౭

గీ॥ నాదంబులోపుట్టె । నలుపైనయాబిందు
బిందువలోబుట్టె । పెద్దకళయు
నాందుబిందుకళల । నంటినమోక్షంబు- యోగి॥ ౨౮

గీ॥ దారపుత్రాదులు । దరిజేర్చలేరని
దండిమైనగురువు । నండజేరి
నిండువున్నతిలోన । నిలచినముక్తిరా- యోగి॥ ౨౯

గీ॥ కర్మగుణములెల్ల । కడపటద్రోచియు
నిర్మలమతితోడ । నిలిచెనేని
మర్మంబులేదురా । మఱిబ్రహ్మమనుచూడ- యోరి॥
గీ॥ తెలుపులోనున్నది । నలుపైనయాబిందు
నలుపునమనీవు । నరశిచూడు
తీగమెరుపువంటి । దీప్తినిగనుమురా- యోరి॥ ౩౧
గీ॥ సత్తుశివకళయనగ । సహజంబుగాచూడు
చిత్తుపరకళయనగ । చిత్తమందు
సత్తుచిత్తులు తెలియ । సరియైనయాత్మరా- యోరి॥
గీ॥ తననుసృష్టిజేశి । తగువాడువిడచెరా
తనదుసృష్టియేమి । తనకులేదు
తన్నుదెలశిసృష్టి । తనవునచూడరా- యోరి॥ ౩౩
గీ॥ తన్నుతెలశేదనుక । తగవేదములువెఱ్ఱి
తన్నుతెలశితేను । తానయవ్యో
తన్నుతానుతెలియ । తగవేదమడియురా- యోరి॥
గీ॥ మురికికొంపలోన । నిరికినజీవిని
పిరికిలేకపైకి । పెరికితీశి
సరుకునున్నపెట్టె । సందునచూడరా- యోరి॥ ౩౫
గీ॥ యేకాతురినిగూడి । యేకమైనిలచితే
లోకంబులెల్లన । లోకమవ్యో
లోకమేదోదాని । లోచూపుచూడరా-యోరి॥ ౩౬
గీ॥ భేదంబులుడిగితే । నాదంబుతెలుసును
నాదుబిందుకళల । నయముదెలుసు
భేదబుద్ధికాద । బ్రహ్మంబుతెలిశేది- యోరి॥ ౩౭

గీ॥ సర్వంబుతెలిసిన । సర్వజ్ఞమైయుండి
సర్వంబులోదాని । సరసగనదు
సర్వంబువారిమైతె । సందేదిలేదురా- యోగి॥ ౩౮

గీ॥ మంకుతనముచేత । మరిబ్రహ్మమెరుగదు
ఆరులోననదియు । నణిగిపోయె
మాటచిక్కిచాల । మురయుచున్నది- యోగి॥ ౩౯

గీ॥ తల్లితండ్రులుమాయ । తనవారుతనుమాయ
ఆలుబిడ్డలుమాయ । అంతమాయ
మాయతెలియువారు । మహిమీదధన్యులు- యోగి॥

గీ॥ జననస్థానమిపుడు । జనిసరిచూడగా
తల్లియయ్యెకల్ప । వల్లియయ్యె
తల్లినితెలిశితే । తానెపోబ్రహ్మంబు- యోగి॥ ౪౧

గీ॥ అంతమందులేదు । ఆదినిలేదురా
మధ్యమందులేదు । మాయయిపుడు
ముందువెనుకలేదు । ముదముతోనిలువురా- యోగి॥

గీ॥ అందరువకటైతె । పొందుగానిప్పుడు
మందమైనమాయ । మాయమాయె
నిందలేదువేగ । నీవెపోబ్రహ్మంబు- యోగి॥ ౪౩

గీ॥ వచ్చినదేదారి । వచ్చినిలచినదేది
మచ్చికతోదాని । మరుగుగనుము
మళ్ళితిరిగిపోతె । మరిమెక్కుండురా-యోగి॥ ౪౪

గీ॥ యాత్రతిరిగేవారు । యేమియుగనలేదు
పాత్రచెడుటేగాని । పరములేదు
సూత్రమంతయుతెలిశి । నేత్రములోచూడు-యోగి॥

గీ॥ కండ్లచూపునుంది । కామాంధకారంబు
కండ్లచూపునుంది । కలియుగంబు
కండ్లచూపునుంది । కరుణయాబ్రహ్మంబు-యో॥ ౪౬

గీ॥ మర్మమంతయుదెలశి । మాయనుతెగటార్చి
మనసుబ్రహ్మమందు । మరిగినేని
తిరుగులేదుముక్తి । దివ్యముగావచ్చు- యోగి॥ ౪౭

గీ॥ హరిదాసులనువారు । హరినితాతెలియరు
హరియుండుతావేది । అదియుదెలుపు
హరియుయెట్టివాడో । ఆదినిచూడరా- యోగి॥ ౪౮

గీ॥ వేదముల్చదివేటి । విద్వాంసులందరు
విధముతెలియలేక । వెర్రులైరి
విధముతెలశితేను । వేదపురుషుడుతాన-యోగి॥ ౪౯

గీ॥ ఆదిచూచెనేని । అంతయుతానౌను
ఆదిచూపనొకరి । కలవిగాదు
ఆదిచూచుచున్న । నదియురాబ్రహ్మంబు- యోగి॥

గీ॥ శివుడుజీవుడయ్యె । జీవాత్మపరమాత్మ
పరగచూడగపర । బ్రహ్మమయ్యె
నింతకంటెవేరు । నికవేమిలేదురా- యోగి॥ ౫౧

గీ॥ పొట్టజీవిబాశి । పోకమునుపేనీవు
దండిమైనగురువు । నండజేరి
దిట్టమయినపదవి । దీప్తియగనుమురా- యోగి॥ ౫౨

గీ॥ పుట్టినతరువాత । గిట్టుటసిద్ధము
పుట్టిగిట్టుచున్న । పుణ్యమేది
పట్టుమైనపథము । ఘట్టిగాజేరరా- యోగి॥ ౫౩

గీ॥ సర్వంబుశివుడని । సరివేదములుబలుక-
వేరెదైవములను । వేడనేల
అంతశివమయమని । ఆనందపడుచుండు- యోగి॥ ౫౪

గీ॥ వట్టియాశలవల్ల । వడిచెడుటేగాని
దిట్టమయినపదవి । తిరుగనరు
మట్టుమాయలవల్ల । మరియేమిలేదురా- యోగి॥ ౫౫

గీ॥ మనసుయెక్కడబుట్టె । మాయయెక్కడబుట్టె
మనసుమాయలకును । మరుగువకటె
మనసుపోవగాను । మాయవెంబడిపోవు- యోగి॥

గీ॥ తెలివిచీకటిగూట । దీపంబువెలిగించు
తెలివిజాడకమునుపె । దేవులాడు
దేవులాడిదివ్య । దేమునిగనుమురా- యోగి॥ ౫౭

గీ॥ తత్వంబుతెలసితే । తగువులాటేలేదు
తత్వంబుతెలియక । తగువులాడు
వట్టిమాటలవల్ల । వచ్చునాతత్వంబు- యోగి॥ ౫౮

గీ॥ వేదమనేమాట । వేదాంతులకుతెలసు
వేదములోవిధము । వెతుకలేక
వేరుగామనసుంటె । వేదార్థమేమెరుగు- యోగి॥

గీ॥ భగముతోనున్నది । భవభోగములచింత
భగముతోనున్నది । భాగ్యచింత
భగముసర్వమునకు । భంగమైయ్యుందిరా- యోగి॥

గీ॥ మలమూత్రములతొట్టి । మాంసంబుపేగులు
మురికిచీముతోలు । మూసుకొనియు
మేడిపండువలెను । మేదినిగనుపడు- యోగి॥ ౬౧

గీ॥ ఇళపింగళినాళ్ల । నిదివైపు దెలసుక
సుషుమ్నమునబోయి । సొంపుమీర
బ్రహ్మరంధ్రములోన । బైలందిచూడరా- యోగి॥
గీ॥ ఆవిధంబునగాక । నేవిధంబుననైన
పట్టలేవుశేషని । పట్టలేవు
పొట్టజీవిబాళి । పోయినమీదనా- యోగి॥ ౬౩
గీ॥ ఆకాశమువాయు । అగ్నితాబుట్టెను
నగ్నియందుపుదక । మప్పుడుబుట్టె
పుదకమందుబృథివి । పుట్టియాయెరా- యోగి॥
గీ॥ పృథివియందుబుట్టె । పురుషులంతినటుకు
అన్నమప్పుడుగలిగె । నదముగను
ఆయన్నరసమెగా । యాబ్రహ్మమైనది- యోగి॥ ౬౫
గీ॥ ఆధారచక్రము । నదిగుదస్థానము
కంగుళద్వయముపై । నమరియుండు
స్వాధిష్టచక్రము । సరససగానున్నది- యోగి॥ ౬౬
గీ॥ మనసునేకముజేశి । మర్మంబుతెలియుమి
చిత్తకర్మభయము । చెదరకుండు
మణిపూరకమునాభి । మధ్యమందున్నది-యోగి॥ ౬౭
గీ॥ ఆవలివిధమంత । నంతునుజెప్పెద
హృదయమందునహనా । హతముగలదు
సరిగజూచిమనసు । సందేహమునువదలు- యోగి॥
గీ॥ విశుద్ధచక్రము । వినుముకంఠమునందు
పట్టుగానునీవు । పారజూడు
మరియవతలున్నంత । మరుగుజెప్పెదనీకు-యో॥ ౬౯

గీ॥ ఆగ్నేయచక్రము । నదియె భ్రూమధ్యము
నాత్మభాస్కరుఁడెపుడు । నచటనిలుచు
నదియమ్యోజాగ్రత । నందులముక్తిరా- యోగి॥ ౭౦

గీ॥ సాధించిశిరసున । సహస్రారమునుజేరి
పరమాత్మపదవిలో । పరగనిలువు
దిట్టమయినపదవి । దినముసేవించరా- యోగి॥ ౭౧

గీ॥ ధనమునార్జించితే । తనకేమిలేదురా
ధర్మమార్జించితే । తనకువచ్చు
ధర్మమునేమాట । తలపుననుంచరా- యోగి॥ ౭౨

గీ॥ జననమొక్కటైన । జాతులువేరాయె
మరుగువక్కటైన । మాటవేరె
కులమొక్కటైన । [illegible]వేరాయె- యోగి॥

గీ॥ సుజ్ఞానపడతేల । సజ్ఞానులేమరుగు-
మంకుడే మెరుగును । మంచిదారి
నక్కనడతలువట్టి । కుక్కలేమెరుగురా- యోగి॥ ౭౪

గీ॥ మంచివానివద్ద । మంకుడుజేరితే
మంచిబోయిమంకు । మరులుబుట్టు
చక్కెరలోచేదు । జతపరచినట్లురా- యోగి॥ ౭౫

గీ॥ వేసువేరయ్యున్న । విధమదితెలియురా
మతభేదములవల్ల । మరుగులాయె
మరుగుడెలశితేను । మరిముక్తిదొరుకురా- యోగి॥

గీ॥ పూజశేయుచున్న । పుణ్యంబుగలదని
భక్తిలేనిపూజ । ఫలముయేమి
ఆత్మసాధునిసిరసు । నంటిపూజింపరా- యోగి॥ ౭౭

గీ॥ మేకఆశీతన । ఏకంబుగానుండే
ఏకముగాజూడు । లోకమందు
ఏకమేకాశని । మెంచినముక్తిరా- యో॥ ౭౮

గీ॥ ఏకమైయుక్కటై । మేర్పాటుగానుండె
లోకంబులోదీని । లోతుగనుము
లోకంబు తెలియను । లోచూపుచూడరా- యో॥

గీ॥ ఉపము తెలశిసీవు । ఉపవాసముండుము
ఉపము దెలశిదాని । ఉనికిగనుము
ఉపవాసమదిగొని । వున్నదేముందిరా- యో॥ ౮౦

గీ॥ వట్టివుపవాసముల । పట్టేమిలేదురా
వున్నపరమాత్మకు । యునికిచెడును
అతినీచమయ్యోను । యామలముతీపోను-యో॥ ౮౧

గీ॥ అన్నరసముకన్న । నతినీచమేలేదు
అంతకంచెనీచ । మయినదదియు
కొంపకాలిపోతె । కోరికేముందిరా-యో॥ ౮౨

గీ॥ సగుణధ్యానమిపుడు । సతతంబుగలిగితే
నిర్గుణధ్యానమున । నిష్టగలుగు
సగుణనిర్గుణములు । సరిమైనయాత్మరా-యోగి॥ ౮౩

గీ॥ యాత్రవిడచినవాడు । యతివరుడవుగాని
పాత్రవిడచినవాడు । పరమయోగి
సూత్రమెరిగినవాడు । సుఖజీవియగునురా- యో॥

గీ॥ జ్ఞానికేమయిన । మానంబు లేదురా
మానంబునెంచితే । మాయతగులు
మానాభిమానముల్ । మాయనరులకుతోడు- యో॥

గీ॥ ఫాలభాగమందు । పరహంసయున్నది
పరమహంసనుబట్టి । బలకరించు
పాపంబునిండితే । పలుకునాపరహంస- యోగి॥ ౮౬

గీ॥ కర్మంబుతోడను । గలుగునుకార్యంబు
కర్మంబుతోడను । గలుగుఘనత
కర్మంబుతోడను । గలుగుసుజ్ఞానంబు- యోగి॥ ౮౭

గీ॥ సప్తధాతువులతో । సమముగాయున్నది
సప్తయోనిలోబుట్టి । సరసముగను
ఆత్మజీవమొకటె । అంతయుఁవకటే- యోగి॥ ౮౮

గీ॥ ధనముధాన్యములురావు । తనవారుతగరారు
వెళ్ళిపొయ్యేనాడు । యేమిరాదు
ధర్మమొకటితప్ప । తనకేమిరాదురా- యోగి॥ ౮౯

గీ॥ తనకున్నయంతలో । తగజేయవలెగాని
తలపుతోనుండుము । దండిగాను
తనకులేకపోతె । తగజెప్పవలెనయా- యోగి॥ ౯౦

గీ॥ లోనజూడగాను । లోకాభిరామంబు
బయలనరశిచూడ । పట్టుపడదు
లోనబయలుజేశి । లోచూపుచూడరా- యోగి॥ ౯౧

గీ॥ హంసమైయున్నది । యాపరబ్రహ్మంబు
హింసనొందనీకు । నేలమిగుల
హంసమానసోహ । మంచునునిలువురా- యోగి॥ ౯౨

గీ॥ వ్యవహారముననాత్మ । వ్యతిరిక్తమగునది
వేరెవున్నవిధము । వెతకగనుము
వెతకినతరువాత । వేరేనులేదురా- యోగి॥ ౯౩

గీ॥ సందుదెలశినీవు, సమముగానుండుము
అందమైనసదవి, నందుజేరు
సుందరంబైనశివ, సూత్రంబుతెలియరా- యో॥

గీ॥ ఆకలిగొనువేళ, అన్నముతినకుంటె
ఆత్మయెట్లునిలచు, అప్పుడెలమి
ఆత్మవేరైపోతె, అందేమిముక్తిరా- యో॥ ౧౧౧

గీ॥ పరమాత్మయనగను, ప్రణవస్వరూపంబు
జీవాత్మయనగను, జ్యోతినయము
అంతరాత్మనంగ, ఆకాశ స్తంభమురా-యో॥ ౧౧౨

గీ॥ మూడుయొక్కటైనశక్తి, ముదముతోనిలచిన
పరమసాధనాన్న, పదవిగలుగు
మరిగిపోయినవాని, మళ్ళెనుసచ్చునా- యో॥

గీ॥ ఓంకారశబ్దంబు, ప్రణవదీగనుగొను
అదియునారాయణుం, డచ్యుజగతి
మతభేదములవల్ల, మరిగనలేరురా- యో॥ ౧౧౪

గీ॥ శివకేశవులసందు, స్త్రీభేదమేలేదు
శివుడువిష్ణుండయ్యె, శీఘ్రముగను
విష్ణుశివుడయ్యెది, వేదవాక్యమెచెప్పు-యో॥ ౧౧౫

గీ॥ పరమపధముతాను, పరగకొల్లబెట్టి
మానవజన్మమున, మరలినాడు
మానవజన్మాన, మాయతగిలుందిరా-యో॥౧౧౬

గీ॥ మాయసుఖముమరిగి, మర్మంబుతెలియదు
జీవభ్రమలచేత, చిక్కినాడు
యాలచిక్కులుచిక్కి, యమబాధపడనేల- యో॥

గీ॥ చిక్కులువదలితె , చేరునుబ్రహ్మంబు
మక్కువతోడుత , మనసునిప్పుడు
నిక్కులులేకుంటె , నీవెపోబ్రహ్మంబు- యోగి॥౧౧౮

గీ॥ ముక్తినినమ్మితే , మోక్షంబుదొరుకును
శక్తినినమ్మితే , చెడగువచ్చు
శక్తినిమరచివి , రక్తుడైపోవలెను యోగి॥ ౧౧౯

గీ॥ పట్టినయాపట్టు , కెట్టుసళ్లకనుంటె
బ్రహ్మజేసినమాయ , బయటపడును
బయటపడినంతలో , బంధంబుకోయరా- యోగి॥

గీ॥ వెతకనేర్పువుంటె , వెతకిగనుంగొను
గురుడుచెప్పినమాట , గురుతుగనుము
వేరుమనసు[illegible]ంటె , విధితెలియలేవురా- యోగి॥

గీ॥ వెతకిగనినమీద , వేరేమిలేదురా
వెతకమనసువుంటె , వెరపులేదు
వెరపుతీరినమీద , విధినుంచిమేమవును- యోగి॥౧౨౨

గీ॥ గురుడుబ్రహ్మంబని , గుణముసిలిపితెగడా
గురుడువెరపుదీరె , గురుతుజూపు
గురుతుజూపినవెనుక , గురుశిష్యలొకటయ్యె- యోగి॥

గీ॥ నీటిలోస్తంభంబు , నిజముగానాటించి
పేటయంతతిరిగి , చాటగనుము
కోటమీదనెక్కి , కోయనికూయరా-యోగి॥ ౧౨౪

గీ॥ తిక్కబట్టినరీతి , తిరిగితేమున్నది
నిక్కలాటగాక , నిజములేదు
పక్కగాపెద్దలు , పక్కనుజేర్తురా-యోగి॥ ౧౨౫

గీ॥ కల్లమానవులెప్పుడు । కలియుగమందున
వేషధారులఁజూచి । వేడ్కపడుదురు
కారణార్థులకండ్ల । గనుగొనలేరురా- యో॥ ౧౨౮
గీ॥ జ్యోతిలోనే పుట్టి । జ్యోతిలోమాడియు
జ్యోతినరయనిహీన । జన్మమేల
జ్యోతినెరుగనివాడు । కోతితోసమమురా యో॥
గీ॥ సంతజోగికేల । సన్యాసియోగంబు
మాచకమ్మకేల । మంచిమగడు
ముక్కిడితొత్తుకు । ముకుటనత్తేలరా- యో॥ ౧౨౯
గీ॥ తలలందు తైలము । తిన్నగానున్నదని
యత్నములేకుంటె । యెట్లువచ్చు
[illegible] । [illegible]ఫలంబు- యో॥
గీ॥ విన్నవారికే తెలుసు । వినుతవాదంబు
కన్నవారికెరుక । కనులపదవి
తిన్నవారెరుగుదురు । తేటైనతత్వంబు- యో॥ ౧౩౦
గీ॥ కానవలెనేవలె । కోటికోటిదేవరలు
మానకమనసున । మరిగియుండు
మరిగియుండకపోతె । మరిజేర్పలేవురా- యో॥ ౧౩౧
గీ॥ నిద్రలోనినిద్ర । నిజముగాతెలియుమి
భద్రమైనపదవి । బ్రహ్మవిద్య
మనసునందునిలిపి । మరిముక్తిజెందరా- యో॥ ౧౩౨
గీ॥ ఈశీతిగురుకృప । నెరుగనేర్చినవాడు
ఈషణత్రయముల । నెగరగొట్టు
ఎగరగొట్టకపోతె । నింజేమిలేదురా- యో॥ ౧౩౩

గీ॥ దేహశిఖరంబున । దీపంబు వెలిగించి
దేహములో మాయ । దీరుగనుము
మనసు బ్రహ్మమందు । మరిగి సుఖమందురా- యోగి॥

గీ॥ గురుని పీఠమందు । గూర్చుండబెట్టుక
మాయనుండనుపట్టు । మాటలేక
నాట్యంబునాడించి । నవ్వుచునుండరా- యోగి॥౧౩౫

గీ॥ కోపములుడిగితే । కోరకశిక్షించు
కోరికలుడిగితే । గుణముకుదురు
కోపములేకుండె । దరిజేరవచ్చురా- యోగి॥౧౩౬

గీ॥ సంసారమునమునిగి । సన్యాసిగాకుంటె
చేసినపాపముల్ । మోసపోవు
మోసపుచ్చకపోతె । మోక్షంబుచేరుచురా- యోగి॥

గీ॥ సన్యాశమునబుద్ధి । సరసగానిలిపితే
సాధించిమోక్షంబు । సరస జేరు
గురునిశేవయందు । గురితప్పకుండురా- యోగి॥౧౩౮

గీ॥ ఎప్పుడుగురుశేవ । తప్పకజేశితే
నొప్పుగామోక్షము । నొనరవచ్చు
సాధువృత్తితోడ । సంతోషమొందరా- యోగి॥౧౩౯

గీ॥ ఆసిరంబుమేను । అధికపాటులుపడి
చిత్తకర్మచయము । చెదరకుండ
నిత్యనైమిత్తిక । మెరుపంగనేలరా- యోగి॥ ౧౪౦

గీ॥ సర్వముతెలశిన । సర్వజ్ఞమూర్తులు
ఆగమాంతమందు । నహర్నలగును
ఆగమేనాత్మగా । యజ్ఞముసేయరా- యోగి॥౧౪౧

## యోగనిద్రాశతకము.

గీ॥ నిత్యకర్మలు తాను । నెరపకనుండును
నిష్టబ్రహ్మమందు । నిలిపియుండు
అట్టివాడుఅహం । బ్రహ్మమనగనువచ్చు- యోరి॥
గీ॥ ఘోతరాజుకునేడు । భూతశంఖులు లేవు
ఆత్మకడ్డనుదాని । నంటనియదు
తానెభూతంబైతె । తనకేమిభయమురా- యోరి॥
గీ॥ తారకబ్రహ్మంబు । తనలోనచకరాగా
నిండియుండగాను । నెరుగలేవ
యెండివాడేవ్రతము । యేర్పాటుశేయకు- యోరి॥
గీ॥ నిర్మలజ్ఞానంబు । నిష్టచూపుటకును
నేర్పరైనగురువు । నిలుపుగాక
కల్లగురువులనుంచి । కడతేరలేరురా- యోరి॥౧౪౫
గీ॥ ధరణిలోతత్వంబు । తరిమిచెప్పేగురుడు
హంసుడుగురుండెచు । నవతరించె
జీవుడుమోక్షంబు । జేరుమార్గముజూపు- యోరి॥
గీ॥ తనలోనఓంయని । తాళమృదంగముల్
వేణువీణెపిడేళ్ళు । వెలయుమ్రోయ
నాగస్వరముతోటి । నాదంబుబుట్టురా-యోరి॥౧౪౬
గీ॥ తోలువీణెయనీవు । తొలుతగాచేపట్టి
పంచతంత్రులువేశి । పరగనీవు
వున్నహంసనుగూడి । ఒప్పుగాపాడరా- యోరి॥
గీ॥ పాటపాడేహంస । పరమునసున్నది
వేటపడదుదాని । కెరపులేదు
జోలపాటపాడి । జోకొట్టుచున్నదే- యోరి॥౧౪౭

గీ॥ నాదంబుబ్రహ్మమని , నమ్మిభజించరా
నాదంబెముక్తికి , నావగాక
భేదంబులెంచక , మోదంబుతోనుండు- యోరి-౧౫౦

గీ॥ పలుకుపలికెదెవడు , పాటపాడేదెవడు
పలుకుపాటలసందు , కులుకుమెవడు
అన్నిటబ్రహ్మంబు , ఆనందపడుచుండు-యో॥ ౧౫౧

గీ॥ తనదులోనహంస , తరియుజపించగా
తనమజపమయంచు , తథ్యముగను
కర్మజపమువల్ల , కడతేరుపెట్లురా- యోరి॥ ౧౫౨

గీ॥ కర్మయోగమువల్ల , ఘనమైనఫలమొచ్చు
ఫలముగోరితేను , పరముచేమను
ఆత్మయోగమునందు , నంటినమోక్షంబు- యోరి॥

గీ॥ రుచులకేచ్చినయోగి , రూఢైనచేయుదు
రుచియుపరమునందు , రూఢిపలువ
నాలుకరుచులకు , నయమేదిలేమరా-యోరి॥ ౧౫౪

గీ॥ వేరెయోచనపెట్టి , వెతకియుగానరు
వింతపలుకులుచాత , వెర్రులైరి
వెతకికన్నవారు , వేదాంతవేద్యులు- యోరి॥ ౧౫౫

గీ॥ మంతనంబునమరులు , మరిమరిపెంచింప
సుంతైనమనసుతో , స్ఫూర్తిగనరు
మరులువిడచితెగురుని , మాటలుచెపినాటు- యోరి॥

గీ॥ ఆకాశమునశబ్ద , మపుడుతాబుట్టెను
వాయువందురెండు , వరుసగలుగు
అగ్నియందుమూడు , అంటియున్నదామి- యోరి॥

యోగనిద్రాశతకము.

గీ॥ గుణమువిచారించ ၊ కోతితోసమమురా
కోతికన్నపెద్ద ၊ కుక్కమేలు
కుక్కకులముతోటి ၊ కొట్లాటజేయును-యో॥౧౭౪

గీ॥ ఆకసముననక్క ၊ అరుచుచునున్నది
పట్టబోవనదియు ၊ పట్టుపడదు
గురునినిలిపిచూడ ၊ గొబ్బునదొరుకురా-యో॥౧౭౫

గీ॥ చూపుచక్కగజేసి ၊ చుక్కజూచి తెగదా
పండువెన్నెలనిండె ၊ పట్టపగలు
పగలులోపరమాత్మ ၊ పట్టిసేవించరా-యో॥౧౭౬

గీ॥ శ్రుతినిల్గట్టితే ၊ చేరునుబ్రహ్మంబు
మనసునిల్గట్టితే ၊ మరుగుదెలసు
చూపునిల్గట్టితే ၊ సూత్రంబెరుంగును- యో॥ ౧౭౭

గీ॥ నీలతోయదమందు ၊ నిలచియుగనుగొను
యింపుమీరదాని ၊ సొంపుగనుము
సొంపైనసూత్రమున ၊ సొచ్చిశోధించరా- యో॥

గీ॥ అవధూతమార్గము ၊ నాత్మనుదర్శించు
మోహపాశంబులు ၊ మొదలుగోయు
యెందునలేశంబు ၊ నెంచకనుండుము-యో॥ ౧౭౯

గీ॥ దీపంబులేకుండె ၊ దీర్ఘాసిభూతముల్
బిడ్డపాపలనెల్ల ၊ పెరికిచంపు
వెలుగుబుట్టినవెనుక ၊ నిలుచునానిముషంబు- యో॥

గీ॥ పుచ్చపండువకటి ၊ యొరులకు తెలియదు
పండురుచియునిండె ၊ పరమునందు
నిండువేడుకతోడ ၊ నిలచిభక్షించరా- యో॥౧౮౧

## యోగనిద్రాశతకము.

గీ॥ పర్వతమునపండు । పండియున్నదిసుమీ
అందరికాపండు । యలవిగాదు
కాటుకపత్తుకు । కన్నిపెట్టితినుచుండు-యోగి॥ ౧౮౨

గీ॥ మదకపండినపండు । మాధుర్యములు మెండు
తినగతినగదాని । తీపిమెండు
కొందరాపండును । కోశియుతినుచుండు- యోగి॥

గీ॥ వేదార్థతత్వంబు । నెరిగియుమదిలోన
మరిగియుండునీవు । మనువులేక
సర్వమునననునీవు । సమముగానుండుము- యోగి॥

గీ॥ బాహ్యరంగమునందు । పరికించలేవురా
అంతరంగంబున । నరశిచూడు
మధ్యరంగమునందు । మరిశివునిజూడరా- యోగి॥

గీ॥ తల్లినిచేపట్టి । తనువునవెతకగా
నలువుదేహమంత । తెలువుయయ్యె
నలువువిరచినవాడె । నాతికేశ్వరుడుండు-యో॥౧౮౬

గీ॥ కష్టకాలమందు । కాలునిచేజిక్కి
హాటముశాయగలేరు । ఘటముతోడ
జీవుడున్నంతలో । శివునిచేపట్టరా-యోగి॥ ౧౮౭

గీ॥ యోగవర్యులజూచి । యెగిసక్కిరించితే
యముడునవ్వుచుండు । యలమితోడ
చేశినకష్టంబు । శిద్ధముగాచెడును-యోగి॥ ౧౮౮

గీ॥ కల్లపలుక్కలవలన । కనపడదుబ్రహ్మంబు
చదివిచదివిచదివి । చావవలెను
చదివివచ్చుటకన్న । చాలకష్టములేదు-యోగి॥ ౧౮౯

గీ॥ పొరుగింటివాడుగా ౹ పొంచియుండును
చిక్కబోకువాని ౹ చేతిలోన
నిక్కఁజూచి పథము ౹ నేర్పనజూడరా-యోగి॥ ౧౯౦

గీ॥ సవికల్పమననీవు ౹ సరిగానునిలిచియు
నిర్వికల్పమునకు ౹ నేర్పుగనుము
నేర్పుగనినవాడు ౹ నిలనుసుజ్ఞానిరా-యోగి॥ ౧౯౧

గీ॥ యెడతెగనిభక్తితో ౹ ఎప్పుడువుండుము
యొప్పుగానుముక్తి ౹ తప్పకొచ్చు
సందడిలేకుండ ౹ సరిసండియుండరా-యోగి॥ ౧౯౨

గీ॥ నాణ్యంబుగానీవు ౹ నరశపొడగాంచుము
ప్రాణంబువాయువై ౹ ప్రబలముగను
ఇళపింగళనాళ్ల ౹ నిదిమానితిరుగురా-యోగి॥ ౧౯౩

గీ॥ యెన్నికెక్కకపోతె ౹ నేనియుకొదువరా
వకనుపొగడితేను ౹ యొనరలేదు
ఆత్మనిలచియుంటె ౹ నందులముక్తిరా-యోగి॥ ౧౯౪

గీ॥ ముక్తికరుగువాసిఁ ౹ ముద్రవక్కఁటెచాలు
నిష్ఠనరువకుండు ౹ నెమ్మనమున
నిద్రమరిచేనేర్పు ౹ నిజముగాగనుమురా- యోగి॥

గీ॥ శాంతశమముగల్గి ౹ సద్గురుపాదముల్
మరుపబోకునీవు ౹ మనసునందు
ఆత్మనాథునిగూడి ౹ యాటాడుచుండును- యోగి॥

గీ॥ యోగిననుచుతాను ౹ యోగముగూర్పక
యోగిగాదువాడు ౹ భోగిగాని
తన్నుతెలియలేక ౹ ధనములార్జించును-యో॥ ౧౯౭

గీ॥ తంత్రవాదులైతె । తరుచుగానుంధురు
మంత్రవాదులయిన । మదిసిగనరు
జంత్రగానిబొమ్మ । చందంబుచున్నది- యోరి॥ ౯౯

గీ॥ కాయరథముమీద । ఘనముగానెక్కియు
వీధువీధులందు । వేటక్తోడ
వూరేగుచున్నాడు । ఒప్పుగాపరమాత్మ- యోరి॥

గీ॥ యెందుతిరిగినశివు । నందేమిగనలేరు
వెర్రిభ్రమలుగాని । వేరెలేదు
పొంతయున్నవాని । పొందేలగానరు-యోరి॥ ౧౦౦

గీ॥ వాక్కునందుగురుడు । వశియించియుండియు
చెప్పమన్నరీతి । చెప్పినాడ
తప్పులెన్నబోకు । దాసునిమీదను-యోరి॥ ౧౦౧

గీ॥ వీరభద్రదాసు । విరివిగాజెప్పిన
యోగనిద్రశతక । మొనరగాను
పరమేశతప్పులు । పాటించిదిద్దుమి-యోరి॥ ౧౦౨

గద్యము.

ఇదిసద్గురు చరణారవింద శేవిత కవితా దురంధర
బ్రహ్మశ్రీ వంగల వంశపయః పారావార
రాకాసుధాకర శ్రీరామశాస్త్రి పు
త్రశ్రీవత్ససగోత్రపవిత్ర వీ
రభద్రదాసప్రణీతంబైన
యోగనిద్రాశతకము
సంపూర్ణము.



శ్రీరస్తు.

శ్రీగురవేనమః.

# తత్వామృతసారశతకము.

క॥ శ్రీసద్గురునెల్లప్పుడు
భాసురముగమనసునందు ♦ వాశిగనిలిపీ
వేసటలేకనుతత్వము
నాసతొనానందమొంది ♦ నరయుముభద్రా. ౧

క॥ వేదార్థముయీతత్వము । భేదార్థములెంచబోకు ♦ ప్రి
యమునమదిలో । నాదార్థమెయీతత్వము । బోదార్థ
ముతోటిముక్తి ♦ పొందుముభద్రా. ౨

క॥ పరుపడియెంచునుమనసా । త్వరవడి శేయుటకుటకు ♦ వా
ప్పితమగునా । నిరువొందనీలోవెతకుము । మరుగైయున్న
దియునదియె ♦ మనసున భద్రా. ౩

క॥ పరువడివేరేగాదుర । నిరవైనీలోనవెలిగె ♦ నీలప్రద్యోతిక్ ।
వరుసతొగనుగొన్నప్పుడె । పరువడియై యాత్మపరమ ♦
పథమే భద్రా. ౪

క॥ దశవిధనాదంబులచే । దశదిశలనుమ్రోగినట్లు ♦ తనలోత
నకుక్ । వశకృతమైవినుచున్నను । మసలకలక్ష్యార్థమది
యె ♦ మదిలో భద్రా. ౫

క॥ జ్యోతిని గానకకొందరు । కోతిగదా తిరుగుచుండు ♦ కొ
మ్మలకొరకుక్ । ఖ్యాతిగ వారలనమ్మితె । భూతలమునని
తిచెరుచు ♦ బుద్ధిని భద్రా. ౬

| అరిషడ్వర్గంబులచే । నరులెల్లను సౌఖ్యజిక్కి ♦ నయగతి
యనుచుఁ । మరితల్లి నెఱుగలేకను । మఱువుతో నున్నట్టివా
రు ♦ మదిలోభద్రా. ౭

క॥ తెలతెల్లవారుచుండును । తెలు పైయున్నట్టినభము ♦ జేదీ
ప్యముతో । అలపట్టపగలులోపల । నిలయమునీవైనయా
త్మ ♦ నెఱుగుము భద్రా. ౮

క॥ లక్ష్యార్థమువాక్యార్థము । నిక్షేపంబైనభావ ♦ మింక
మదిలో । కుక్షిలో గనుగొన్నప్పుడె । తత్క్షణమున నాత్మని
లచు ♦ తనలోభద్రా. ౯

క॥ తనువును గానక నెప్పుడు । తనుమఱచియు తానుతిరుగు ♦ దా
రీషణచే । తనువేదో తానుమేదో । తనుతా తెలియంగవ
లయు ♦ తనువున భద్రా. ౧౦

క॥ నిండుగ వెలిగే బ్రహ్మము । మెండై తానిండియుండె ♦ మే
దినిలోనఁ । వుండెను కొండకుచివరను । పండైయా పరము
నందు ♦ బాగుగభద్రా. ౧౧

క॥ అక్షరముతోడ నెప్పుడు । కుక్షిలో తాతిరుగుచుండు ♦ కో
రికతోడఁ । నక్షత్రనాధుడత డే । తత్క్షణమున వెలుగు జే
రు ♦ తనువునభద్రా. ౧౨

క॥ స్థూలములోపలనొకటి । చాలగసూక్ష్మంబు వెలుగు ♦
చకొగమదిలో । మూలంబులోనబూడుము । లాలితగతి
నీకు తెలను ♦ లక్ష్యముభద్రా. ౧౩

క॥ సన్నత్రుదిద్దినదూరీ । వున్నదు వెన్నెలలోనీవు ♦ పొందుగనీ
వుడుఁ । మిన్నందినిలచిజూచిన । పన్నుగ పరమాత్మనే
రు ♦ పరమునభద్రా. ౧౪

క॥ యన్నగమనసేకారణ । మున్నదిపరమాత్మజేర • ముద
ముతోనిప్రుడుఙ । యెన్నెన్నిరూపులైనది । వున్నదిసీమన
సులోన • వ్రసికీయుభద్రా. ౧౫

క॥ ధర్మాధర్మములెల్లను । నిర్మలమతి తెలియుగాన • నిలకడ
లోనఙ । దుర్మతులకేల తెలసును • మర్మంబులునెల్లమది
ని • మానుగభద్రా. ౧౬

క॥ నిత్యముయీదేహంబని । సత్యముతా తెలియలేక • సం
తోషముతో । నిత్యానిత్యము తెలియక । ప్రత్యేకముపడు
నుపాశ • బంధముభద్రా. ౧౭

క॥ పరసుఖమునొందువానికి । మరుగైయున్నట్టిఇహము • మ
రినమ్మడుగా । అరలేకనిలిపియుండును । వరుసతోతన
యాత్మదరిశ • తనువునభద్రా. ౧౮

క॥ పంచప్రాణంబులచే।పంచక్రోశంబులమరి • ప్రఖ్యాయు
గా । పంచావర్ణములమ్యెను । పంచాబ్రహ్మంబుల
మ్యె • పరమతిభద్రా. ౧౯

క॥ కన్నులకామంబున్నది । కన్నులుసకలంబునకును • కార్యం
బులుగా । కన్నులుగురుసూత్రంబును । కన్నులులేకుంటె
ముక్తి • గలకదుభద్రా. ౨౦

క॥ భావాభావములెల్లను । భావములోబయలుజేశి • పరికిం
చినయా। భావముశ్రీహరిజేరును । భావాతీతంబులదియె •
బాగుగభద్రా. ౨౧

క॥ చక్కగను తెలివిచేతను । మక్కువతోయుక్తిగనిరి • మరి
పెద్దలుగా । మిక్కిలిభ్రాంతులువిడచియు । దక్కకసం
సారజలధి • దాటిరిభద్రా. ౨౨

క॥ అందరుజేశేపనులే । కొందరువిడువంగలేద ♦ కోరికతోడం । అందరితోసమమయితే । నిందెరుపాత్రులనుగార ♦ నిజముగభద్రా. ౨౩

క॥ కొందరుద్వైతంబంచును। కొందరునద్వైతమనుచు ♦ కొసతెలియరుగా । కొందరుగురుసూత్రముచే । నందరిలోమరుగుగనిరి ♦ నాత్మలోభద్రా. ౨౪

క॥ భోగముమదిలోగలిగిన । యోగముచేకూరదెవ్వడు ♦ యోగ్యతగానూ । భోగముత్యాగముజేశే ♦ యోగులకునుముక్తినాత్మ ♦ యోగముభద్రా. ౨౫

క॥ మోహావేశముచేతను । ఆహామువిడువంగలేక ♦ నయమనుకొనుచున్ । మోహావిరక్తికిమార్గము । మోహామునుసర్వంబునకును ♦ మూలముభద్రా. ౨౬

క॥ ఆహం జెవ్వరికైనను । నాహమునధికంబునైతే ♦ నమ్మనివిధమున్ । నాహామేముక్తినిజేరుచును । నాహామువిడువంగవలయు ♦ నయముగభద్రా. ౨౭

క॥ ఇరువైయారవతత్వం । బరుదుగజీవాత్మదాని ♦ నాపరమాత్మం । నిరవాందనీలోచూడుము । మరువైయున్నదియనదికెు ♦ మనసునభద్రా. ౨౮

క॥ నాగస్వరమునబట్టి । నాగులనాడించెగురుడు ♦ నారాయణుడే । వేగమునునిలిపియుంచుము। బాగుగపరమాత్మజేరు ♦ పరమునభద్రా. ౨౯

క॥ సంకటమునసరిజేరక । సంకల్పములెల్లమదిలో ♦ సరిజేశియుతా । సంకల్పమెసరిబంధము । సంకల్పమెముక్తియనుచు ♦ సాటుముభద్రా. ౩౦

క॥ నీలోననీవుచూడుము । నీలోనిలచున్నదదియె ♦ నీనాలో
నకా । నీలోనలయముజేయుము । నీలోనీవైనదదియె ♦ ని
జముగభద్రా. ౩౧

క॥ నీచములోఁబుట్టినదే । నీచములోనిలచిపెరిగి ♦ నీచుండ
య్యేకా । నీచపుదేహంబునకే । నీచపుబ్రతుకునకు నియ
మ ♦ మేదియుభద్రా. ౩౨

క॥ లోననెపదిలముజేశియు । లోననెయున్నట్టినభము ♦ లో
మదిగనిసకా । లోననెవెలుగైయుండును । లోనేలోఁజూ
పుచూడు ♦ లోకులభద్రా. ౩౩

క॥ బిందువలోనానాదము । బిందువలోకళయుశేర్చి ♦ బి
ద్రునమదితా । బిందువనునిలుపకుండితె । బిందువనందం
బుచెడును ♦ ప్రియమునభద్రా. ౩౪

క॥ అన్నియుతెలశియుమదితా । వున్నదిపోగొట్టుకున్న ♦ వా
ప్పితమగునా। యెన్నెన్నిపాట్లుపడినను ♦ లన్నియు వ్యర్థం
బుగాద ♦ లదిగనుభద్రా. ౩౫

క॥ తలజడలుదాల్చివేగమె । నిలయముగడ్డంబుపెంచి ♦ నిలక
డలేకకా । అలవేషధారులకే । నిలయందున ముక్తిలేదు ♦
నిజముగభద్రా. ౩౬

క॥ యోగముజేసేమదికే । యోగముచేకూరుగాక ♦ యో
గ్యతగాను । యోగముత్యాగముజేసే । భోగులకెట్లబ్బు
ముక్తి ♦ యుక్తిగభద్రా. ౩౭

క॥ మంత్రాయంత్రముచేతను । మంత్రంబలుసలుపుకొనుచు ♦
మరిమరినెవ్వరుకా । మంత్రంబేదోతెలియక । మంత్రజ్ఞు
లనుసీమగనరు ♦ మదిలోభద్రా. ౩౮

క॥ భూలోకంబునకొందరు। చాలాసంకటముచేత • సరితెలి
యకయా । లాలించి తత్వమెరుగక । మాలిమిమదిగనగలే
రు • మనసునభద్రా. ౩౯

క॥ ఆదియుమదిలో జెలశియు । ఆదియుతాబాయకున్న • నభ
వుండౌనూ। ఆదియుబాశినవానికి। బోధయుతాపరముచె
డును • బుధవరభద్రా. ౪౦

క॥ సంఘముమదిలోనొల్లని । సంఘముదరిజేరకుండ • సరినిలి
పినగయా। సంఘముసాధులకెప్పుడు । సంఘములేదనుచుమ
సాటుముభద్రా. ౪౧

క॥ రాగముమదిలో సరగువి । రాగికిమదినిలుచుగాన • రయ
మునమదిలో । యాగంబుచెడదుయుక్తికి। బాగుగపరమా
త్మతత్వ • భావమెభద్రా. ౪౨

క॥ ఆగ్రహములన్నివిడచియు । నిగ్రహమున మదినితాను• నిలి
పినయడలన్ । విగ్రహముతానెయయ్యెను । ప్రజ్ఞానము
బ్రహ్మమనుచు • బలుకుముభద్రా. ౪౩

క॥ కర్మేంద్రియములనెప్పుడు । నిర్మించేకార్యమేదో • నిజము
గ తెలిశీ । మర్మంబులెల్లవిడచే • నిర్మలునకుముక్తిగాద । ని
జముగముగభద్రా. ౪౪

క॥ తిండీపోతులగూడియు । తిండియుతినుటకునుగోత • తీరుగ
ధరలో । ముండామోపులవద్దను । మెండుగపండుటయు
గోత • మేదినిభద్రా. ౪౫

క॥ పరదారలపైయాశను । పరద్రవ్యము తస్కరమున • పరి
పరివిధమున్ । పరక్షేత్రములహరించిన। పరువడినరకము
కుప్రాప్త • మగురాభద్రా. ౪౬

క॥ ఒకట్టిదీపముతోనే । మిక్కిలిదీపములు అగును ♦ మేదిని
లోనన్ । మక్కువతో వెలుగుచున్నది । చక్కగనీమనసు
లోన ♦ సరిగనుభద్రా. ౬౩

క॥ నిత్యానిత్యము తెల్లను । ప్రత్యేకము బ్రహ్మసూత్ర ♦ భా
వంబున నే । అత్యాశవిడచిమదిలో । నిత్యానందంబుగను
ము ♦ నిజముగభద్రా. ౬౪

క॥ లింగాశబ్దమువాచ్యము । అంగములో నిండియుండే ♦ అ
ది తెలియకయా। భంగంబులౌదురిలలో । సంగతితానెగ్గు
గలేరు ♦ సతముగభద్రా. ౬౫

క॥ చక్రంబులరయువానికి । వక్రత్వము లేదుసుమ్మీ ♦ వసుధ
లోనేని । ర్వక్రత్వమైన పదవికి । నాక్రమణము జేశిమ
దిని ♦ నరయుముభద్రా. ౬౬

క॥ చింతకుమూలముజననము। చింతకుసంసారమంత్రము ♦ తీ
తిలోనెపుడున్। చింతకుమూలము కర్మయు। చింతకుతన
చిత్తచయము♦ చెదురునుభద్రా. ౬౭

క॥ చిత్తముచెదిరేదానికి। మత్తైనామాయజేరి ♦ మది తెలియ
కయా। ధుత్తరీన్మైతులతూగును। పొత్తునబ్రహ్మంబుగన
దు♦ పొందుగభద్రా. ౬౮

క॥ పాశములనుగోయువానికి। వాశిగనేవిధముల్తైననాశలుతే
వే। గాశిల్లదెప్పుడిలలో। నాశములేనట్టిపదవి♦ నరయుము
భద్రా. ౬౯

క। పోచందముఠాచందము । మేచందములేదుగాన♦ మేర్ప
డమదిలో। నీచందమునీవరయుము। నాచందమె బ్రహ్మము
నుచు♦ నమ్మనుభద్రా. ౭౦

క॥ మాతాపిత్రులమలమిది। ఖ్యాతిగమదినెంచిచూడ♦ కల్వర
మాయెక్। నాతాపి శశేషము। [illegible]యందునీచమ
య్యెనుభద్రా. ౭౧

క॥ అష్టదళకమలమ[illegible]ను। [illegible]ష్టతో పరమాత్మ[illegible] ♦ నిలకడలే
కక్। స్పష్ట[illegible]రుగుచున్నది[illegible]ష్టముమ[illegible]ంచకిప్రుడు♦
గనుగొనుభద్రా. ౭౨

క॥ డెబ్బదిరెండ[illegible]। డబ్బిలోయున్నట్టినాడ్య ♦ నిబ్బరము
గనే। [illegible]పింగళ। గొబ్బున[illegible]వష్ణనరయు♦
గొనుమదిభద్రా. ౭౩

క॥ గురురాజచెంద్రుడె[illegible] [illegible]ముల్లేకతాను♦మది
లోనిలచీ। సురరాజ్యపదవినొల్లక। పరరాజ్యమునేలు
చుండె♦ పరమశిభద్రా. ౭౪

క॥ సాలోక్యముసామీప్యము। చాలాసారూప్యమనగ ♦ సా
యుజ్యమునే। వీనైసారిష్టములో। నీలోనిష్కళయెగాక♦
నిజమదిభద్రా. ౭౫

క॥ నిష్కళయేనిజరూపము। నిష్కపటములోననీవు ♦ నిలచిన
మెడలక్। నిష్కళయేవైకుంఠము। నిష్కళనిజఈశ్వరుం
డె ♦ నిజమదిభద్రా. ౭౬

క॥ భ్రూమధ్యముసూషుమ్నరొ। భ్రూమధ్యముమధ్యనాళ♦
భ్రూయుగమందుక్। భ్రూమధ్యమెమేరుశిఖరము। భ్రూ
మధ్యమెఆపాజ్యోతి ♦ బుధవరభద్రా. ౭౭

క॥ తత్త్వములోతత్పదము। తత్త్వములోత్వంపదంబు ♦ తరిచి
నయడలం। తత్త్వములోఅశిపదమే। తత్త్వమునీవనుచుమదిని♦
తరువుముభద్రా. ౭౮

క॥ తత్వజ్ఞానులకెప్పుడు । శత్రుత్వములేదుగాన ♦ చేరికతో
డన్ । మిత్రుత్వమెమదినుంచుము । కర్తృత్వము గాదటం
చు ♦ గనుగొనుభద్రా. ౭౯

క॥ మదినొక్క చోటనిలిపియు। ముదముతో యాబోధయంత♦
ముగిశినకతనన్ । నిదిగాదనిశ్చయముగా। సతతముసమా
ధియగను ♦ సన్నుతభద్రా. ౮౦

ఉ॥ ఓంకారముశేయువారికి । హుంకారములేదుగాన ♦ ఆత్మ
లో నెప్పుడున్ । ఘీంకారవెల్లమానుము। ఓంకారమునర
దుపనను ♦ వృంచుముభద్రా . ౮౧

క॥ యోగముజేశేవారును। రోగములోచిక్కువారు ♦ నోయ
రుసుమ్మీ । భోగముమదిలో శేరవు । రాగిగతాతిరుగుచుం
డు♦ రయమునభద్రా॥ ౮౨

క॥ రేచకములుపూరకములు। నోచనతో తెలియుమదికి ♦ నా
ప్పగయెపుడుం। పాచీనకుంభకము। సూచనగనుగొన్న
వాడు♦ మఘయగుభద్రా॥ ౮౩

క॥ కార్యాకార్యములకునే। కరణముతనయాత్మగాద♦ తరిచే
విధమున్ । విరమించిచూచెదానికి । సరసతయాతత్వముం
ద్రుడు♦ సన్నుతభద్రా॥ ౮౪

క॥ సాధిష్టనుసరిబ్రహ్మయు। విధిమణిపూరకముపిష్ణు♦ విహి
తముగాను। అదిహానాహతమురుద్రుడు। మదివిశుద్ధముజీ
వ♦ మగునురభద్రా॥ ౮౫

క॥ ఆజ్ఞేయమెపరమాత్మ। విజ్ఞానముతోటనీవు♦ విధితెలియ
మురా । అజ్ఞానమెల్లవిడచియు । సుజ్ఞానముబ్రహ్మమను
చు♦ చూడుముభద్రా॥ ౮౬

క॥ తరచియుచూచినవారికి । వెరపేమియులేదుగాన ♦ వే
టరితోమదిలో । అరచియుగనుగొన్నప్పుడె । సరసతొ
సర్వంబుబ్రహ్మ ♦ మగునురభద్రా. ౮౭

క॥ తత్వమును తెలియకెప్పుడు । మత్తులోపడియుండెనేని ♦ మ
దితెలియదుగా । చిత్తములయమునుజేశే । నిత్యులకేము
క్తిగాక ♦ నిజముగభద్రా. ౮౮

క॥ లయమునుజేశేవారికి । బైలైనాశెళుకుదోచు ♦ భావిం
పంగా । నియమము యాశెళుకునమది । కలియగనీమన
ముజేర్చి ♦ గనుమదిభద్రా. ౮౯

క॥ పంచీకరణములోనే । నెంచియుతాపంచియున్న ♦ పం
చముడయ్యెన్ । వంచనలేకనుపంచము । డంచితముగము
క్తికరిగా ♦ లయమదిభద్రా. ౯౦

క॥ అండజములుస్వేతజములు । మెండుగబుద్బుదములమరి ♦
మెళుకువతోడన్ । నిండుగస్థావరములచే । నుండెనజం
గనుములమరి ♦ సూక్ష్మలోభద్రా. ౯౧

క॥ గంగాయమునలనుమను । సంగతిస్నానంబుజేశి ♦ సం
తోషముతో । లింగంబునుదర్శించిన । భంగములేదనుచు
ముక్తి ♦ పరమతిభద్రా. ౯౨

క॥ మనసునవాక్కుకర్మయు । అనయమునేవియుసులేక ♦ సం
టించినచో । వినయముగవేడ్క నొందును । తనతోతన
రాజవీధి ♦ తనవునభద్రా. ౯౩

క॥ మాటలతోపనియేమియు । వాటముగాగురుడుచెప్ప ♦ వ
చనముచెవులో । సూటిగవిననేర్చనవా । డటుయిటులే
నట్టిచోటు ♦ కరుగునుభద్రా. ౯౪

క॥ ముక్కునుబట్టకఘూలీ । మక్కువతోఁ సిలిపిబయలు ♦ మరి
పాకెరిగా । మొక్కువఆనందముతో । చక్కనియోగంబు
వారు ♦ సలిపిరిభద్రా. ౯౫

క॥ ప్రణవంబుశేయువాడిల । సణువునవున్నట్టిపదవి ♦ నా
ణ్యాముగాఁగ । న్నణువులోనణువైయున్నది । గణనాదిగ
కన్నులందు ♦ గనుగొనుభద్రా. ౯౬

క॥ విరాట్టైవిశ్వమందున । స్వరాట్టైసర్వజీవ ♦ సంఘము
లోనే । సరిసామ్రాట్టైనిండెను । విరాటువిగ్రహముఁదా
తాన ♦ వినరాభద్రా. ౯౭

క॥ నిత్యముయీదేహంబని । సత్యముగాఁదీసినమ్మ ♦ సహజ
ముగాదు । వ్యత్యయమైపోనియ్యక । ముత్యమునీమనసు
జేశి ♦ మురయుముభద్రా. ౯౮

క॥ సుఖదుఃఖము రెండిటచే । అఖములుశేయుచునుమదిని ♦ అ
టుఇటులేకఁ । వక వేళనైననిల్వదు । యిఖయేమియునై
నలేదు ♦ యిదిగనుభద్రా. ౯౯

క॥ పరమేశ్వరయీతత్వము । పరమానందంబుతోటి ♦ భజి
యించితిరా । అరలేకకుక్షినిండా । హరిహరస్మరణంబు
సేతు ♦ ఆత్మలోయీశా. ౧౦౦

క॥ పరమేశ్వరనీతత్వము । పరమామృతరసమువేగ ♦ పాన
ముజేశే । నిరతముయోగ్రీందులకే । సరసతసద్గతిని గాం
చు ♦ సతతముగయీశా. ౧౦౧

క॥ పరమేశ్వరయీతత్వము । పరగతిగాంచుటకుమనసు ♦ ప
రిపరివిధముఁ । వెరపేమిలేకతరచితి । త్వరలోసితావు
తెలశె ♦ తనువుసయీశా. ౧౦౨

క॥ మంగళము దేశికేంద్రా । మంగళముదయాంతరంగ ॥ మ
దిలోనీకుఁ । మంగళములోకపూజిత । మంగళమోసర్వ
సగుణ ॥ మహనీయనిధీ॥ ౧౦౩

శ్లో॥ ధ్యానమావాహనం - శింహాసనం - పాద్యం- త
ద్దైవచ - అర్ఘ్యం - ఆచమనీయంచ - స్నానం - పంచామృ
తైస్సహ - సిద్ధోదక - వస్త్రయుగ్మం - యజ్ఞసూత్రం - వి
భూషణం - విలేపనం - చాక్షతాంశ్చ - పుష్పం - స్వర్ణ- వి
నిర్మితం - ధూపం - దీపంచనైవేద్యం - పానీయ్యం- ఫలమే
వచతాంబూలం - దక్షిణాధిక్యం- మంత్రపుష్పంప్రదక్షిణం-
నమస్కారో - దేశికేంద్రంమయాతుభ్యం - నివేదయేత్ -కృ
పయాం - గృహ్యాతాం - స్వామి - న్యూనాధిక్యం - నచింత
యఅస్మద్గురుచరణారణారవించాభ్యాం - నమోనమః॥

అఖండ - సచ్చిదానంద - పరబ్రహ్మణేనమః॥

ఇతి - రామగురుపరబ్రహ్మణేనమస్తు.

గద్యము.

ఇది సద్గురు చరణారవింద సేవిత కవితా ధురంధర
బ్రహ్మశ్రీ వంగల వంశపయః పారావార
రాకాసుధాకర శ్రీరామశాస్త్రి పు
త్రశ్రీవత్ససగోత్రపవిత్ర వి
రభద్రదాసప్రణీతంబైన

త త్త్వా మృ త సా ర శ త క ము.

సంపూర్ణము.





శ్రీ ర స్తు.

## సుజ్ఞానతత్వములు, అను

# తత్వజ్ఞానకీర్తనలు.



రాగం - నాదనామక్రియ - అటతాళం.

రావేపోదాము- మానసహంసా॥ రావే॥

౧ రావేపోదామయా- రవ్వాలుయాలానె-
రామాగురుపాదములు- రఘుమానపూజింప॥ రా॥

౨ ఎన్నిజన్మములందు- యేమీతెలియలేవు-
ఈజన్మమునభక్తి- యేర్పాటుగానుంచి॥ రావే॥

౩ మల్లెపువ్వులతోటె- యుల్లమాలరగాను-
కొల్లాగపూజింప- కోరిగురువునుజేర॥ రావే॥

౪ గుణములెల్లమాని- గురునిజేరబోతే-
గుణముసిర్గుణమయ్యే- గురుతుబూవుతండ్రి॥ రావే॥

౫ నమ్మికొల్చితెగురుడు- నెమ్మానమునవిడమా
యిమ్మహిలోపల - యిరవుబూవుతండ్రి॥ రావే॥

౬ పరమపావనమైన- పంచాక్షరీమంత్రం-
పఠనజేశితెమనను- పరముజేరవచ్చు॥ రావే॥

౭ ధరణిలోభద్రాయ- దాసునిబ్రోచిన-
పరమేశునిపూజింప- పరమసంతోషమున॥ రావే॥

### ౨—నాటకురంజి-రూపకం.

దారిజూపేగురువు నేడు- దైవమెగానీ॥

౧ గురుడు హరుడు రూపామనుచు-
కోరియుంటే రామాగురుడు॥ దా॥
౨ కరుణతోటిగురుతు తెలిపి- కర్మమానేజన్మబాపే-
కాంతాదిషడ్వర్గము- కడకుదోలేరామగురుడు॥ దా॥
౩ నాలుగుంచిమూడుత్రోసి- అయిదుచాతబట్టినంతలో
ఆలుపోలు లేక ఆత్మను- తరచిచూచి తెవకట్టుండు॥ దా॥
౪ ఆరుమూడుతొమ్మిదింట - అణచిబట్టిజూచి తేను-
వేరు లేక వెలుగులోన- నంటబూపెరామగురుడు॥ దా॥
౫ నాదమదుగొనరసివినగ- నాదమేగానీ-
నాదుబిందుకళలమధ్య - నాట్యమాడెరామగురుడు॥ దా॥
౬ ధరణిలో శ్రీనంబూరి- పురవేణుగోపాలుని-
వీరదాసుభద్రయకును- పరముదెల్పెరామగురుడు॥ దా॥

### ౩—శంకరాభరణం-అట.

నినునీవు దెలుసుకుని నీలోనా వెతికితె-
నీకు తెలుసును గదరా॥ నిను॥

౧ నినునీవు తెలశితె నీకన్యమైనాది-
నున్నాదియిఖవేమిరా- ఓరన్నా॥ నిను॥
౨ కన్నవారలతోటి కానివాదాడితే-
మెన్నోసంచితము లెన్నశక్యముగాదు-
వున్నదారినిగానరా- ఓరన్నా॥ నిను॥

౩ ఎన్నిజన్మములందు నేమి తెలియలేవు- యీజన్మమున
గనరా- కన్నవారలయందు- కరుణించియీగురుడు-
కారణమిచ్చెగదరా- ఓరన్నా॥ నిను॥

౪ హరుడుగురురూపామై అవతరించిజనుల- దురితము
లుబాపునురా- హరుడుగురుడవునీవె-హరినారాయ
ణుడవే- ఆరువిడిచిచూడరా- ఓరన్నా॥ నిను॥

౫ పరమపావనుడైన ఫాలలోచనుడుండే - ఫాలమరసి
చూడరా- పరమగురుడేకాంత భావజ్ఞుడైయుంటె-
పరబుద్ధులికయేలరా- ఓరన్నా॥ నిను॥

౬ ధరణిశ్రీనంబూరి ధామునిగొలచితె - దారిజూపు
నుగదరా- వరవీరభద్రయకు విరివిగ దెలిపిన-
పరబోధయిదిగదరా- ఓరన్న॥ నిను॥

౪—తోడిరాగం- ఆది.

౧ అందుచూచినాకాశీ- ఇందుచూడగాలేదా-
ఇందుధారునీకళ- యిందులోజూడరా॥ అం॥

౨ మూడుయేరులుకలసి-ముదముతోపారును-
మూడువిడచినీలో- మోదముజెందరా॥ అ॥

౩ పంచకోశములాలో- చంచలామందూచు-
పంచభూతములాపై - మించిచూచినాగాని॥ అం॥

౪ అన్నపూర్ణేశ్వరుడు- ఆనందమైయ్యుండు-
ఆనందమరసిచూడా బ్రహ్మానందమేగానీ॥ అం॥

౫ ఆరుకోటాలనడుమ- అరుదుగలీనమై-
హరుడునివాసించే- పురముచూడగాలేదా॥ అం॥

౬ ధరణిలోనంబూరి- పురినున్నవంగల-
వరవీరభద్రిదాసు- విరివిగజూచిన॥ అం॥

౫—శుద్ధకాంబోది-జుల్వ.

ఎందుకునీకింత మోహాము- ఓవెర్రిమనసా॥ ఎంద॥

౧ ఎందుకునీకింత మోహా- మిందుజూచిననీకు తెలియదు-
మందబుద్ధిచాతనీకు- ముందు తెలియదే లేమనసా॥ ఎం॥

౨ పంచవింశతితత్వములపైన - మించియున్నగురునికళ-
అంచితముగనీవుజూచి- చంచలాముడుగావెమనసా॥

౩ సూటిగగురుకృపనువడసి - వాటముగమూటదెలసి-
తేటగానుకంటిలోన- బాటతెలియావెమనసా॥ ఎం॥

౪ అనుదుగనీలోనవెతకి- అరుగుణములట్టెవిడచి-
పురహరునిగొలచినీవు- స్థిరముగనుండవెమనసా॥ ఎం॥

౫ విరివిగనంబూరిలోన వీరభద్రిదాసునకును-
పరము తెలిపేరామగురుడు - మరువకుమని
యిరవుజూపె॥ ఎందు॥

౬—కళ్యాణి-ఆది.

౧ కట్టుజేశినాడు గురుడు- కట్టుజేశినాడు॥
కట్టుజేశినాడెట్టుతెలగకను-దిట్టపరచితనగుట్టుదెలపినను॥

౨ నిన్నుదెలసుకొనివున్నతముగనీ-
వున్నతత్వమును వున్నదిగనుమని॥ కట్టు.

౩ తప్పితములుమది యొప్పితిరుగకను-
వొప్పుగనుండినతప్పులు లేవని॥ కట్టు.

౪ ఆరుపట్టినీ వారువిడువమని-
యూరకయుండక నారశిగనుమని॥ కట్టు.

౫ కన్నుచూపులను వున్నదిగనుమని-
పన్నగశ్రీహరి నెన్నుచుండుమని॥ కట్టు॰
౬ విరివిగవంగల వీరభద్రయకు-
వెరవులేమయిక పరముజూడుమని॥ కట్టు॰

### ౭—నాదనామక్రియ-అట.

పోతుందీఘటము ఓవెఱ్ఱిమనసా-
పోతుందీఘటము - ఎన్నాళ్ళున్నా పొయ్యేదేనిజము॥
౧ పోతుందేయీఘటము దీని పొందుయాలనీకు-
అంతారంగమునందు ఆత్మ తెలియలేక॥ పో॰
౨ తనువునాదనినీవు తనువుపైనాశాచే-
తనువెవరో తానెవరో- తనకుదంట్లయెవరో॥ పో॰
౩ ధనధాన్యములుజూచి తబ్బిబ్బుగాకాను-
దనరాగతనలోన- ధనమేదో తనువేదో॥ పో॰
౪ తొమ్మిదితూట్లాచే తొఱ్ఱికుండగాని-
తొమ్మిదిలోపాల తొలుగాకచూడుమీ॥ పో॰
౫ సతిసుతులనుజూచి సతమానినమ్మకను-
హితవూగ తెలశీతే సతులెవరో సుతులెవరో॥ పో॰
౬ ఆశపాశములెల్లా కోశివేశినీవు-
వాశిగరామునకు దోశిలొగ్గిచూడు॥ పో॰
౭ గురువుజెప్పినయుక్తి గురుతూగగనలేక-
యురమునందునశివుని మరుగూనజేరకను॥ పో॰
౮ విరివిగనంబూరి పురమూననిలచీన-
పరశివునిగొలచీయు వెరవులేకబ్రతుకు॥ పో॰

౮౧—నాదనామక్రియ- ఏకతాళం.

మాయనునరక వేమనసా-గురు రాయుని జేర వేమనసా॥

౧ మాయనునరక నుపాయముదెలసుక-
పాయములేకను న్యాయముగనుమిక॥ మా॥

౨ మూత్రపురీషము మురికితోలుదీని-
సూత్రముదెలశియే మాత్రమునమ్మక॥ మా॥

౩ కల్లరూపకము యిల్లజేసుకొని-
వుల్లములోపల కొల్లగజూచి॥ మా॥

౪ అండపిండబ్రహ్మాండమంతటను-
నిండియున్నదీ కొండపొడుగున॥ మా॥

౫ యెన్నశాస్త్రములు నెన్నిచదివినా-
యెన్నరానిపద వున్నదివాకొటి॥ మా॥

౬ మనసునిలిపినీ మనసునదెలశీ-
మనసులోనయా మనసునతరచీ॥ మా॥

౭ గురుసూత్రంబును గురుతుగదెలసుక
మరువకహరునీ మరుగునజేరీ॥ మా॥

౮ వరనంబూరి వురిగోపాలుని-
స్థిరముగగొలచియు వెరవులేకనీవు॥ మా॥

౮౨—నాదనామక్రియ- ఆది.

కాంతనుజూడవెజీవా- ముక్తికాంతనుజేర వెజీవా॥

౧ కాంతనుజూడ నేకాంతమునందున-
కాంతయున్నదీ కాంతులతోడుత॥ కాం॥

౨ అంతరంగమున వంతుజేసుకొని-
వింతలులేకను వెలుగుచున్నదీ- పంతములాడక పైకేర
మ్మనీ- యంతోవింతగ బలుకుచున్నదీ॥ కాం.
3 కన్నులలోపల వున్నదిచిన్నది- పున్నమవెన్నెల బైబై
యున్నది- యన్నరానియా పదవితోనున్నది - కన్నది
విన్నది తిన్నగనున్నది॥ కాం.
౪ మూటిమీదను సూటెగజూచి - వాటమైనయా తోట
లోజేరి- నీటుగులుకయా ఆటదెలసుకొని - పాటెత
ప్పకను పట్టిచూచితే- దిట్టమైనయా పట్టైయున్నది॥
౫ నిక్కజూచి మెట్టెక్కవచ్చినా - మిక్కిలిఘనులకు మేలై
యున్నది- చుక్కలబైబైసొంపుగనున్నది - మక్కువ
దీర్చనుమరితానన్నది - అక్కరపడిగురు నడిగి తెలుసు
కొని- వక్కదారినారమ్మన్నదియిక॥ కాం.
౬ అరచిజూచినంబూరిపురములో - మెరయుచున్నపర
మేశునిదలచీ-కరుణించినయారామగురువుని- వరుసక
మనసునమరిమరిదలచియు-అరమరలేకనుఆత్మనగూడీ॥

౧౦—సావేరి-అట.

జీవానీవుగానవా- నీలోదారి- జీవా॥

౧ జీవానీలోన భావాము తెలియాక-
జీవాశివుడైయ్యుండి జీవాత్మపరమాత్మ॥ జీ.
౨ ఇహపరములు రెండు యెంచిచూడగాను-
ఇహపరబంధామె యెంచూకునీకీషు॥ జీవా.
3 సంఘాములేకా నిస్సంఘూడవైయ్యుండి
అంగాములోనున్నా లింగాముని వేకా॥ జీ.

౪ యెన్నిజన్మములాల నెనశియున్నఅఘము-
లన్నిదెలశీనీవూ వున్నాదిపిడనాడ॥ జీవా.

౫ మూలాముదెలశియూ మఁరికెశరీరమన-
మూలాములోమూట మెనసిగానూటాకు॥ జీవా.

౬ పరమాపధముజేరె చాటతెలియలేక-
పరమునీవైయ్యండి- పరమాత్మనీవిఘు॥ జీవా.

౭ హరుదెవడు హరియెవడూ హరిహరుం దెవ్వాడు-
హరునీహరీసందూ ఆత్మాలోగనుగోను॥ జీ.

౮ చేశీసపాపాము వీసామైనపోదు-
వేసాములుచేత గాసినొందగనేల॥ జీవా.

౯ మర్మాములేకాను మరిరామసద్గురుడు-
ధర్మమూనేదారి తరిచీచెప్పినమాట॥ జీవా.

౧౦ విరివీగనంబూరి హరిజేరెవిధమూను-
మరువాకమనసూన మరినమ్మిగనుగోను॥ జీవా.

౧౧—నాదనామక్రియ- ఆట.

యెరిగినందుకుగురుతు యెరుకనే కాదా॥
యూ, ధరణిలోపలవకడె దైవమే కాదా॥

పల్లవి.

౧ యెరుకాయెదైవంబు యెరులపాటించేటి-
యెరులపలుకులుపలుకు లింతనే కాదా॥ ఎ.

౨ గురువుజెప్పినయుక్తి గురిగన్నవారికి-
మరిలోకభ్రిమలన్ని మానుటయె కాదా॥ యె.

౩ పరమైనవైరాగ్యం బరగియున్నందులకు-
తెరువువిషయముల్ విడచుటే కాదా॥ యెరి.

౪ ఆదియోగమునందు ఆనందమును జెంది-
అధికహారమునీంద్ర లణచుటే కాదా॥ యే౽రి.
౫ వేదబోధలయందు విధులయినయోధులకు-
వాదభేదములన్ని వదలుటయే కాదా॥ యే౽రి.
౬ తనువులోపల వెలుగు తా తెలిసినందునకు-
తనువుపైయాశలు తనకుయికయేలా॥ యే౽రి.
౭ తనుమరచినంబూరి హరిజేరినందులకు-
అనువుగాభ్రమయంత విడచుటే కాదా॥ యే౽.

## ౧౨—నాదనామక్రియ-అట.

తెలియాగలేరా బ్రహ్మములోన కలియాగలేరా-
సర్వము తానై తెలియాగలేరా॥
౧ తెలియాగలేరయా యిలపామరులు తన్ను-
సలలితముగ దేశికులు జెప్పాగగాని॥ తెలి.
౨ భ్రాంతూలుమాని సర్వము తానై శాంతాముబూని-
సంతాసామునజగ జ్ఞాలాముమదిరోసి-
నంతవారలుగాక తంత్రజ్ఞులునుతన్ను॥ తెలి.
౩ హంకారిగాకా మానసమందూ శంఖాలులేక-
బొంకుమాటలబుద్ధి- నే- వంకాకుబోనీక-
సంకల్పముడిగి నిస్సంకల్పులునుగాక॥ తెలి.
౪ అంధాకారమునా జీవభ్రాంతిబంధాము వలన-
సందేహముల కేయా నందించుచునుజడుడై-
ముందుగతిగానాని మందబుద్ధులునాత్మ॥ తె.

౫ భేదాములేకా కర్మలతోటి వాదూకుబోకా-
సాధుసంగతిలోన సంచారులై మెలగుచు-
శోధించినటువంటి సుజ్ఞానులును గాని॥        తెలి.

౬ ధర్మాలునైనా సమ్మతిమీర నిర్మాలులైనా-
రమ్యామైనమెట్టి రామాగుర్వుపలుకు-
నమ్మకుండినలక్ష జన్మాలకునైనా॥        తెలి.

౧౩—సావేరి-అట.

౧ ఆధారచక్రాము భేదాముగనుగొని-
మోదాముతోసా ధిష్టాము దెలసూక- బాధలేదు నీకు
బోధాగనుగొనుమనసా॥ గోవింద-గో-శివగోవింద॥

౨ యిళపింగళనాళ్ళ యడమకుడివైపూన-
నాళ్ళనాశికమందు నటనచూడవెమనసా॥   గోవిం.

౩ అకారమేబ్రహ్మ ఉకారమేవిష్ణు-
మకారమేరుద్రు డేకామైనదిచూడు॥        గోవిం.

౪ అకారముచ శ్వాస అట్టెలాగినీవు - ఉకారమునవా
యు వాపూగపూరించి- మకారమునుచాతమరి రెం
డుకుంభించి - యేకాగ్గివైనీవు పోకలూడుగమనసా॥

౫ ఆరుచక్రామూల వేరులేకనుబూచి-ఆరూఢసహస్రా
ము నందునున్నగురుని - మరుపులేకనీవు మదినమ్మిగను
గొని- స్థిరమూగపరమాత్మ చెంతజేరుమనుసా॥గో.

౬ ముగ్గూరుమూర్తులకు మొదటనున్న- ఓం- తగ్గాకమన
సూన తరచితరచిచూచి- నిగ్గూగ వెలిగేటినిలంపుజ్యో
తిలో- మొగ్గూగస్ఫటికాము మొదలేచూడుమనుసా॥

# తత్వజ్ఞానకీర్తనలు.

౭ అందాముగా వెలుగు నందుమానసు నిలిపి- యందాము
లేకాను అందాముగనుగొని - యింది రేశుని పదిలో-
పొందూగదలచీయు- వందానముగ ఆనందామెగను
మనసా॥ గోవిం.

౮ ఆత్మాలోనున్నట్టి నిత్యానిగనుగొని- నాత్మానిత్యాని
యందు నయమూగలయపరచి - ప్రత్యేషముగను బ్ర
హ్మ నందమైనట్టి - ఆత్మవివేకమున నాత్మ గనుగొను
మనసా॥ గో, శివగో.

౯ అరలేకనంబూరి పురమూనన్నట్టి - పరమేశుపద
ములు పట్టినమ్మికయున్న- వీరాదాసు మదిని వెరవు
దీర్చెకొరకు - మరి రామ సద్గురుషు మమతదీర్చెను
మనసా॥ గోవింద-శివగోవింద.

౧౪—ఆరభిరాగం రూపకం.

గురువువాచ్చె వేళలాయె - మరువబోకువే మనసా॥

౧ పరమగురుడు హాసుడేగాని - వెరపేటికిమరువబోకు॥

౨ కర్మమూనేజన్మములో- మర్మ మరిగి మరువు లేని-
ధర్మపనేదారిజూపి- కర్మజన్మము కడకు ద్రోయు॥ గు.

౩ అందు ఇందు గానూమనసు - సందేహములు లేకయుం
డె - పొందూగయీ మేడలోన- అందాము దెలుపుట
కును గాను॥ గు.

౪ మరువు లేని మెరుపులలో- వెరవులే సిలచినాను- అర
మేటికి గురుడు యెప్పుడు - నిరవుగాను నేర్పుజూప॥ గు.

౫ చెలరేగి కళలతోను వెలిగేటి వెలుగుజూప-
అలబట్టబైలైనాది - నిలయాముకన్నూల నేర్పుజూప॥

౬ వేగంబూన నంబూరిలో- జాగు శేయకానుయిప్రుడు బాగైనా బ్రహ్మపథము-బోధజూపుటకనుగాను॥ గు.
౭ వీరభద్రదాసుమనసు వెరపుదీర్చుటకునుగాను - మరి రామసద్గురుడు మరుపులేని నిరవుజూప॥ గురుడు.

(షడూర్ములు)

౧౫—శుద్ధసావేరి-అట.

యంతోవిచిత్రమై యున్నజగతినిజూడ - అంతా మాయగనున్నాది॥ యం.

౧ వింతవింతలుజేయుచును పురకాంతలాశలుతగిలియున్నది- అంతన్నను తెలియనీయ్యకయంతో పాపముగానెయున్నదీ॥
౨ ఘనహాక మోహ దుఃఖములాను రెంటిచే- గాశీనొందుచు నున్నాదీ- ఘనతరంబైనట్టినమనసూ ధర్మమనితా తెలియకు న్నదీ- మనసుమాయల రెంటిధర్మము మాయమై తాపోవు చున్నదీ॥ యంతో.
౩ బలమైనశగుత్సుప్తి పాసాల రెంటచే- నలువనూగోనియు న్నదీ- ఇవి నిలయమైనా ప్రాణినర్మము నెరుగకనుయిలలో సనెప్పుడు- విలయమయ్యేసంగతినితా నెరుగకున్నది యే మిచెప్పుదు॥ యెంతో.
౪ మర్మంబువిను జననామరణానుబాలు దేహ - ధర్మమూలచే తానూ॥ ఇవి కర్మజన్మము రెంటిచేతను- కదళిపెనుగొనిపో వుచున్నది- మర్మమేవిన జెప్పితిషాడూర్ములాభావమిప్పడు.
౫ ధరణెశ్రీ నంబూరి పురమూన వెలశీన - పరమేశుకృపచే తానూ॥ మరుపులేనిపరమపథమును- నిరవుజూపిరామస ద్గురు- వీరభద్రదాసుమనమునరచిచూడగానూ॥ఇది,ఎం.

## తత్వజ్ఞానకీర్తనలు.

(యీాషణత్రయములు)

౧౬—నాదనామక్రియ-అట.

వింతలమారి- జగతీ దీనిరంతు దెలియవేసుమతీ॥

౧ కాంతలమోహము గ్రమ్ముకయున్నది-
పంతమేల దీనంతు తెలియుమీ॥ఇది. వింత.

౨ ధనముజూచి తబ్బిబ్బుజెందుచు-
తనలోనున్నా ధరి తెలియకనూ॥ విం.

౩ పుత్రమోహమున మునిగియుబ్రహ్మ-
సూత్రము తెలియక సుడిబడుచున్నది॥ వింత.

౪ తనువుననున్నా స్థితి తెలియకను-
తనువునరచియిది తల్లడమొందెను॥ వింత.

౫ మందమైన వట్టాశచేతను-
ముందు తెలియక మోసమైనదీ॥ వింత.

౬ పట్టులేకబల్ తిరుగుచున్నదీ-
చట్టంతయుతా మట్టైయున్నదీ॥ వింత.

౭ ధరసంబూరిలో మెరయుచున్న-
పరమేశునిగొల్వక పరముదొరుకదూ॥ వింత.

౧౭—నాదనామక్రియ - అట.

కాయాపురమునివాసం- వూ,
పాయాము దెలశితే- బ్రహ్మవిలాసం॥ కా.

౧ పాయాకగురుశేవ చేశేదవ్రతమూ-
న్యాయాముతప్పక నిలచిందేసతమూ॥ కాయ.

౨ కామాదిగుణమూల కపటామెగనుము-
పామారమునులేక పరయోగామనుమూ॥ కా.

౩ హంసస్వరూపామెవాసం- ఇది,
హంసహంసపరమ హంసస్వరూపం॥		కా.
౪ భావమెల్లఆత్మ భావామేసతతం
భావాములోచైతై బరగినదేనిరతం॥		కా.
౫ మూటిమీదసూటి చూచినదేనిజము-
పాటీగాపరమూకు భాటాదేగనుమూ॥		కాయ.
౬ అరలేకనంబూరి పురమందేనిరతం-
వీరభద్రదాసు మరువందేనియతం॥		కాయ.

౧౮—జేగడ-అట.

బుద్ధిజాడ్యాలుతమలో పూర్ణముగనిండిన-
బుద్ధిచేబ్రహ్మము పొడగానరైరీ.
౧ కద్దులేదనేవార్లు యిద్ధరణిలోపలను-
పద్దులాడుచువట్టి వ్యర్థులైపోదురు॥		బు.
౨ యెందెందుతిరిగినను యెందుజూచినగాని-
పొందుగాముక్తిపి అందగాలేరైరి॥		బుద్ధి.
౩ కాశినాధుడుతనలో వాసుడైయుండగను-
గాశిపడుటకునరులు కాశికేగుదురయ్యా॥		బుద్ధి.
౪ ప్రొద్దుప్రొద్దునలేచి శుద్ధితీర్థములాడి-
గద్దెపైగూర్చున్న పెద్దరికమేమయ్యా॥		బుద్ధి.
౫ అక్షరంబెరుగనా పేక్షమెందుకుయిఘను-
కుక్షిలోవాయువులు కుదురుగానిలుపనీ॥		బుద్ధి.
౬ ముగురుమూర్తులకాది ముగ్గురిలోముందుగా
ముగురుమూలంబును ముగురుగల్గినతావు॥		బుద్ధి.

౭ శిరిమించునంబూరి పురములోనాశివుని-
స్థిరబుద్ధిచేతనూ నిరతమూశేవించ॥ బుద్ధి.

## ౧౯—కాంభోధి- అట.

వట్టిమాటలవల్లదొరుకునా- శివపధము
పట్టలేకపోయిరిగా మదిలోశివుని కట్టలేకపోయిరిగా.

౧ అట్టిగురుకృపలేక యెట్లుదొరుకునుత్రోవ-
రట్టుమాటలవల్ల- గుట్టూతెలిశేదెట్లు. వట్టి.

౨ భేదావాదముతోటి నాదాముతెలియాక-
మోహామైనబుద్ధి సాదారమునులేక. వట్టి.

౩ జీవ్వూడెశివుడనెడి శివుడేజీవుడనెడి-
జీవాత్మపరమాత్మ- శివునిగాదెలియకను. వ.

౪ మనసుపొయ్యెటిత్రోవ మాన్పశక్యములేక-
మనసుబ్రహ్మామునందూ మననాము శేయకను. వట్టి.

౫ తత్వాము తెలియాక వత్తూలోపడియుండీ-
వ్యక్తిలేనివారు భక్తితెలియకయిట్టి. వట్టి.

౬ గారాడిమాయాల నారాడియేగాని-
గారవించిగురుని కరుణపొందనివార్లు. వట్టి.

౭ ధరణీలోనంబూరి పురమూననిలచీన-
పరమేశుకృపలేక పరముచూడనివార్లు. వట్టి.



౬ గారాడిమాయాల- నారాడిమేగాని
గారవించిగురుని- కరుణపొందనివార్లు॥ వట్టి.
౭ ధరణీలోనంబూరి- పురమూననిలచీన
పరమేశుకృపలేక- పరముచూడనివార్లు॥ వట్టి.

౨౦—మధ్యమావతి - అట.

తరువాబొచ్ఛ్రిరీ - మాయాజగతీ - తరుచైనజ్ఞానులు. త॥
౧ తయూచుగమాయా- ప్రక్రృతినిబాట్టీ
తరచీతరచీ జ్ఞాన - తరిదీశిరిగా॥ తరు.
౨ వుబ్బాచుమానసు చాతబట్టి - రజ్జూసర్పామగో
బ్బాన మదిపర్వతమూనదీశి తబ్బిబ్బుగాక - నిబ్బర
మునగురు పుత్రులందరు జబ్బుజేశితే- తంటానొననిద
బ్బునజ్ఞానా యమృతముమనకు- అబ్బియున్నదని ఆ
త్మలోతమారు॥ తరు.
3 శంఖా లేకాను అందరుగూడీ - బొంకూనామనసు -
యే వంకాకుతిరుగనీకబట్టి మంకూలేకాను- కొంకక
యూతను భాండములోపాల- జంకులేకాయూక తమ
లోతాము టెంకెల-లోన- ఓంకారమువినుచుయిం
కాయిూ జగ తాశ వలదని తరువా బొచ్ఛ్రిరీమాయా
జగతీ॥ తరు.
౪ అద్భూతమైనదాని తమలో- ఇది చాటుటాకు మేదీ
కారణమూమనకూయనుచు ఆనీయుగాక- అదుగో
గురుకృప యందున మెలగుచు- వాదభేదమ్ములు వరుస

తొవిడచీ- సాధుజెనులాతొజతగూడియు యిక- అది
రా శ్రీహరి హరియనిదలచుచూ॥ తరు

౫ వేరూ కొయాకా నంబురిలోనా- పరమేశుకృపనూ
పరతత్వమైనదారీమనకు- ఓరూపుగాక - నిరతము
రామా సద్గురుదయను - తరుచుగ పెద్దలు తరువబో
దురు- వీరభద్రదాసా ఇటురమ్మని- మరుపులేకతను-
మమతలువిడచీ॥ తరువా॥

## దేహానింద్యము

౧౭—ముఖారి- అట.

ఎందుకూ జన్మమెందుకూ-పరమేశా యెందుకూ॥ జన్మ.
యెందుకూయీజన్మమిప్పుడు - ముందువెనుకను తెలి
యలేని నింద్యమైన దేహమిం పొందగా ధరియించితిరిగే- యెం
దుకు - జన్మా॥ ౧

విడుపజాలని భ్రాంతిచేతన పుడమియందేదిక్కు తెలి
యక- కుడితిలో పడ్డెలుకచందము- కూడియున్నదియీశరీరం
యెందుకూ- జన్మ॥ ౨

మక్కువగుయిల్లాలుగృహములు- చక్కనీసుతులన్నద
మ్ములు- నిక్కమేనని తల్లిదండ్రుల టక్కు తెలియక చిక్కియు
న్నది- యెందుకు- జన్మా॥ ౩

దిక్కుమాలినజగములోపల- దుఃఖములరోగాలునొ
ప్పులు- సృక్కినీల్గెదరెరుగలేక-యెక్కడో యమలోకమనియే
యెందుకూ- జన్మ॥ ౪

సూత్రమెరుగని శుక్లశోణిత- మూత్రములతో మురుఫునొందిన- పాత్రమెరుగని యాత్రజన్మము- నేత్రములకానందమయినది- యెందుకు- జన్మ॥ ౫

టక్కుసగు సంసారజలధిలో ముక్కుమూసుక మునుగుచున్నది- టక్కుపిక్కులు జేయుచునుయిక వెక్కసామయిన ట్టితనువు- యెందుకు- జన్మ॥ ౬

నిర్మలంబుగ రామగురుని మర్మమెరిగతిరుగలేని- కర్మల కునిదిదారి తెలియక హర్మ్యమైతా పోవుచుండే - యెందుకు- జన్మమెందుకు॥ ౭

అందముగనీపీరదాసు సందియములేకాను గొలిచెను- కంసవాలేకానుదయతో ఇందుధరనీ యందుజేర్చని - యెందుకు- జన్మమెందుకు॥ ౮

సమాధి.

౨౨. కమాసురాగను- జుల్వతాళము.

౧ జీవితోసమ ధియమ్యో- భావమున్నది-
న్యాయముతప్పకగురుని- నిలచికొలచీతే॥ జీ.
౨ మూడుత్రోవలలోనచాలా- ముఖ్యమైనాది-
నడిమిత్రోవనుబోయినాగ- కన్యనుకలశీతే॥ జీ.
౩ నిలయమైనాతావుదెలశీ- నిలచిజూచీతే-
వెలయగయూవెలుగులోనా-కలశినిలచీతే॥ జీ.
౪ పంచవింశతితత్వములాపై- మించిజూచితే-
అంచితమైనట్టిజ్యోతి- గాంచినిలచీతే॥ జీ

౫ ఆధారమునందుహంసా- ఆటదెలశీతే-
వాదములేకానుబ్రంహ్మము- పాదుజేశీతే॥ జీ.
౬ నాదుబిందూకళలమధ్య- నాణ్యమైనాది
బోధతోయాచూపులోన- చూపుతెలశీతే॥ జీ.
౭ ధరణిశ్రీనంబూరిలోన- జేరినిలచీతే-
మరువకయారామగురుని- మరుగుతెలశీతే॥ జీ.
౮ పరుడైనాహరునిమదిలో- మరువకుండీతే-
వరవీరభద్రదాసుకు- నిరతమైనాది॥ జీ.

## ధ్యానము.

౨౩—శంకరాభరణము - ఆది.

శివశివ- శివశివ- శివశివ- శివశివ- శివశివయనవేమనసా॥

౧ శివునిదాలాచీతే- చిత్తమందుసీకు-
చింతలులేవే- ఓ మనసా॥ శివశివ.

౨ శివుడేగురుడు శివుడేవిష్ణు- శివుడేబ్రహ్మముమనసా-
శివయనురెండాక్షరములుపర- శివపధమైనదెమనసా॥
౩ ఆటకచేలుడు అంతటతానై- అంటియంటడేమనసా-
వంటిగచీకటియింటిలోపలను- కంటినోచూడమెమన॥
౪ ఆరుచక్రములఅంతయువెలుగు- మరుగుతెలియకేమన
యేరులుమూడుయేకమైనదీ- తీరుగనుంగొనుమనసా॥

౫ ఆరువిడువవే అంతు జెలసునీ-కదిపరిపూర్ణమెమనసా-
మరువబోకుము వరుసతో బ్రంహ్మాను- పాదైయున్నదీ
మనసా॥ శివశివ.

౬ చూపులోనయా చూపునవున్నదిసూత్రముగనవేమన
చూపురూపమున సుస్థిరమైనది-బాటగనుంగొనుమన॥

౭ ఆర్తరక్షణుడు అతడేశివుడు - ఆదియక్షరమెమనసా
వేదవేద్యుని వెన్నెలలోపల - విధమంతయుగనుమనసా॥ శి

౮ మూటమీదను సూటిగజూచి- ముక్తిగనుంగొనుమనసా
వాటముగాగురు శేవలో యెప్పుడు- వరుసతోనుండవెమన॥

౯ సత్తైయున్నది సరిగదేహాను- చిత్తుగనుంగొనుమనసా
చిత్కళలతోయా శివుడే బ్రహ్మము- శీఘ్రముగనవేమన॥

౧౦ హరినారాయణు డతడేశివుడు-పురమునచూడవెమనసా
కరువుదీరనీ కన్నులలోపల- కాంతినిచూడవెమనసా॥ శివ

౧౧ ఆత్మబోధనీ కంటిజెప్పితినె- వింతలుమానవెమనసా
శాంతముతో శివరామభజననీవు-సంతసమునజేయుమన॥

౧౨ మరువకరామా గురుబ్రహ్మమును- మరిమరిదలచవెమన
మరువులేదునీకు యెరుకైయుండును- వరుసతోవినవెమన॥

౧౩ అరలేకనునంబూరిపురములో- మరుగంతయుగనుమనసా
విరివిగవీరాభద్రదాసుడు- హరినిదలంచవెమనసా॥ శివ॥

భజన.

౨౮—రాగంమధ్యమావతి- రూపకం.

౧ రామనన్నూదయనుబ్రోవరా- శ్రీ- రామ
కామితఫలదాయకనే- పామరముననినువేడితి॥ రామ.

౨ ఆరులోనఅంటబోనురా- శ్రీ- ఆరు
పోరులనేమదినొల్లక- పారముగానినునమ్మితి॥ రామ.
౩ మాటజిక్కి- మరువబోనురా- శ్రీ-
మాటికినీనామమువది- వాటముగనిభజియించితి॥ రామ.
౪ ఆశలోన గాశిబడనురా- శ్రీ - ఆ
పాశములను తెగగోసినీ- దాసుడనైయుంటిభువిలో॥ రా.
౫ సర్వతత్వసముడ వీవెరా- శ్రీ- స
సారముగాజగమంతట- సారమె నీనామమెకద॥ రామ.
౬ ఆగమాంత మందుజూచేన- శ్రీ- ఆగ
బాగుగనీదర్శనమే- యోగులకేదోరుకునుగద॥ రామ.
౭ భరితశ్రీనంబూరిపురమున- శ్రీ- భ
పరతత్వముభద్రదాసు- భజియించెనునీనామము- రామ.



౨౫—నాదనామ- అట.

శివుడేశ్రీరాముడై శీతాలోగూడీన-
చిత్రమంతయుజూడరే॥ శి.
౧ శివునిశ్రీహరినందు స్థితభేదామేలేక-
శీతాభిరాముడై- చింతాదీర్చుకోరికు॥ శి.
అంతారంగమునందు- ఆత్మారామూడై- వంతాన
మునసిండెనే- కాంతుడై ఘనులనూబ్రోచియు- శాంతుడైశ
మదమముతోడుత- భ్రాంతులన్నియు విడచితనలో- స్వాంతు
డై వెలుగుచును వేగమె- శి॥ ౨.

పరతత్త్వమైనశివ-పంచాక్షరిలోనపరమతారకమ్మునాం
డేనే - పరమహంసై ప్రజ్వరిల్లుచు - పురమునను కాపు
న్నదతడె - భరితమైయాపరబ్రహ్మము - దురితములు మెడ
బాపుకొరకు- శ్రీ॥ ౩.

అన్నిరూపులుతానై- యున్నాపారాత్మ్యాని - యె
న్నాటకుయుక్తిగాదె- యున్నాసర్వజీవములలో- మిన్నని
లచుచున్నతేజము- పన్నగారక్షించు కొరకు- సన్నిద్దినిలచి
నాడట- శ్రీ॥ ౪.

అంటిఅంటకతానై- నొంటిగాఇంటిలో- వెంటానం
టెనుగాదే- కంటిలోచూచి ననువకటే- మింటిలోనిలచున్న
దొకటే- కంటిమింటికెంటి సందున- దంటమేడేతారకము
నకు- శ్రీ॥ ౫.

కరుణించినంబూరి- పురమునసిలచియు - కళ్యాణ
రాముడయ్యెనురుపబోనవరుపురాజే - వెరపుదీర్చినరామగు
రుడు- పరమపురుషుడు- హరియుహరుడై - కరుణనెలినకన్న
తండ్రి- శ్రీ॥ ౬.

దరిజేర్చుటకుదండి- దాతేశ్రీరామూలు - దారితప్ప
బోకేతరుచుగాశ్రీకమలనాభుని- వరుసగాశేవింపుచుండే- ని
రతముగఈసీరదాసుడు- తరచితరచిచూడగాను- శ్రీ॥ ౭.

౨౬.—తోడి - అట.

పొంగబోకువేమనసా-

౧ పొంగబోకునీదుపొంగు- కుంగిపొయ్యేగానివినవే-
సంగతెరుగలేకపూరికె- భంగమైపొవ్వేవమనసా॥పొం.

౨ మక్కువతో దేహంబుజూచి- నిక్కపాటుబడు టెగాని-
సృక్కిజారిపోయ్యేవాడు- వక్కరైనా వెంటరారె॥పొం.

3 మాయకులోనైనీవు- మమతలుపడబోకమనసా-
ఆయువుచెడకుండ-ఉ-పాయముగనుగొనవెమనసా॥పొం.

౪ చాలగసంసారమంత- సంతకూటామేమనసా-
వీలుతెలిపేగురునిజేరి- వాలుయేదోగనవెమనసా॥ పొం.

౫ ఆశకులోనైనీవు- గాశిబడకేవెర్రిమనసా-
నాశనులేనట్టిపదవిలో- వాసమైనిలువావెమనసా॥ పొం.

౬ వీరభద్రాదాసునకూను- వెరవుదీర్చినరామగురుని-
మరువకస్మరియింపుచుండి- నిరతముహరియనవె మనసా॥



## ౨౭—జేగడ-అట.

౧ పరనుపావానీ- పాలించవేతల్లి- పర
ధరలోనమునివరులంతనిను- పరశక్తివాని నెరసమ్మరె॥ప.

౨ అన్నిలోకామూలకాదిశక్తినీ-
నెన్నినవానామాము- లన్నీటనీవేక॥ ప.

3 తామాక్షి కరుణించవే-
కాలారాత్రియందు- కలియతిరిగితల్లి॥ ప.

౪ కాత్యాయనీ కమలలోచనీ-
కరుణనాపైయుంచికావుమంటనె- తల్లి॥ ప.

౫ నారాయణీ నాదరూపిణీ-
వారాహివైనీవు వడిగతిరిగ- తల్లి॥ ప.

౬ శాతోదరీ శంభుమోహినీ-
సీతాశివశాంకారి నిర్మాదనాశాని॥ ప.
౭ మాహాలక్ష్మి మనవీజేశీతీ-
మాయాంమారీవచ్చి మనుజూలవెరపెంచి॥ ప.
౮ ధరలోనవీర భద్రాదాసూనీ-
నరమారలేకాను వెరవుదీర్చావే- తల్లి॥ ప.

## పూజకు పుష్పములుకోయటము.

౫౮—ముఖారి-ఆదితాళం.

పూలుకోతామా మనసా- పూలుతెత్తామా॥
పూలుకోతామా మనమూ- పున్నామవెన్నెలలోనా-
చల్లాగరామునికొరకు- యుల్లామలరాగాను మనము॥పూ॥ ౧
పంచవింశతితత్వాములలో- అంచితముగా తెలుసుకొని
చంచలామతిగాకావేగా- సంచితామైనట్టివృక్షము॥పూ॥ ౨
మేరుకొండా లెక్కినిలచీ- మూడుజాడా తెలసుకోని
వేమకాలోనిలచియున్న- వాడూవెలిగేతావుకుబోయి॥ పూ॥
మూలకోనాలోనానున్న, మూలమైనాకాంతనుగూడి
మూలాములేనట్టివృక్షము- మూలమునాఅందుకోసి॥పూ॥ ౪
వాదామూలువిడచిపెట్టి - భేదామానేమాయగట్టి
వాదాభేదాములులేని- వాడూవెలిగేతావుకుపోయి॥పూ॥ ౫
యెందువెతకిచూచినాను-అందామైనపూలులేవు
పొందుగాయీమేడాలోన- ఇందుధరునిపూజకొరకు॥పూ॥ ౬

దండీగానంబూరిలోన - నిండి వెలుగుచున్నహరికి
దండాముబెట్టుచు మెప్పుడు- అండాబాయక నుమనము॥పూ॥ ౭
వెరపులేకా కోరికతో- వీరభద్రాదాసు మెప్పుడు
పరమగురుతు తెలుసుకోని- పరమంమునున్నట్టిగురునికి॥పూ॥ ౮



## మానసపూజ.

రా—సావేరి - ఆది.

పూజశాయ వెమనసా- పూజశాయవే॥ పూజశాయ వేమనసా- పున్నాను వెన్నేలనడుమ- పూజాగోనునట్టయీశుని- యీజగమూన- నిలచినవు- పూ॥ ౧.

కర్మానిర్మాల్యంబులాను- కడపాటద్రోచియున్నవు- కర్మావిడచీ నిర్మాలంబై కన్నచిన్మయ- మూర్తినిబూచి- పూ॥

శాంతమానే భక్తిచేత- శమదమానే యుక్తితోటి- శాంతశమదము- తోయముఅర్ఘ్యం సాంతం పాద్యం-పాని యమిచ్చి- పూ॥ ౩.

దండిగా అభిషేకముచేశి-నిండుదృష్టివస్త్రములిచ్చి- మెండుశక్తి త్రయపుపవీతంనుండాగ-జ్ఞానగంధామిచ్చి-పూ॥

తనలోనున్నాదారిదెలశి- తనభూతదయనక్షుతలిచ్చి- తనసుకృతంబు చేతగలిగిన- తనుభక్తియనేపూలతోటి- పూ॥

అంతారంగచతుష్టయము- మంతనమున ధూపముగాను- శాంతగ యఖిలేంద్రియాది- వింతగదీపార్తినిచ్చి- పూ॥

ఆశాపాశములో నాసీవు - లేశమైన పట్టుబడక- వా
శిగా తత్వామృతము నాసతో నైవేద్యమిచ్చి- పూ॥ ౭.

నాదాముపీనులయందు భేదాములేకానువినుచు- నా
దాతీతమైన యానందతాంబూలమిచ్చి- పూ॥ ౮.

పంచభూతాపూలు యెప్పుడు - ప్రపంచమంతసిం
డినాది- వంచనలేకానునీవు పంచార్తిగాఅర్పణజేసి- పూ॥ ౯.

ఆత్మానాత్మావివేకమున ఆత్మేనైనాదితెలశీ- జ్ఞా
త్వానుంచి నీవుయెప్పుడు- నాత్మసువర్ణపుష్పమిచ్చి-పూ॥౧౦

చిత్తుసత్తాతెలసుకొని చిత్తచలనములేకనీవు - చిత్త
సు ప్రదక్షిణముగ- చిత్తాము విశ్రాంతముజేసి- పూ॥ ౧౧.

సాహసమున నీవుయెప్పుడు- సాహాయితి యననామ
సాకారము- సోహామానేభావముచేత సోహాము సోహం -
సోహమనుచూ- పూ॥ ౧౨.

మంచివారి తెలసుకొని- మించియున్నమానముచేత-
అంచితముగ స్తుతిజేయుచు- వంచనాలేకానునీవు- పూ॥౧౩.

చూరవగానంబూరిలోన పిరిపిగా పెలిగేటపారిని- మ
రువకాను మనసునందున- వెరపులేకయప్పుడునీవు- పూ॥౧౪.

## మంగళహారతి.

### ౩౦—సురట - అట.

మంగళం మంగళం సదాచార్యమంగళం
మంగళం సద్గురురాయ మంగళం. మం॥

మంగాళామెనీకు ఆంగాములోపల - గంగయమునల నడుమ సంగామమురా - శృంగారమునతోటి బంగారుమేడలో రంగూగవెలిగేటి రామలింగేశా॥మం॥ ౧

పంచాకోశములపై మించీయున్నఘన- సంచీతమైనిండి అంచీతమునా- పంచవాయువులాతో ప్రణవమైనిలచీయు- పంచప్రాణరామలింగామహేశా॥ మం॥ ౨

అండపిండబ్రహ్మాండమంతటనిండి- కొండచివరయందు నుండీనీవూ మెండూగావెలిగేటి పండువెన్నెలలోన- దండీగపండిన రామలింగేశా॥ మం॥ ౩

ఆరుకోటలనడుమ వేరులేకతిరిగి ఆరూఢి సహస్రారమందూనిలచీ- తరుచూగశ్రీరామ గురురాజచంద్రునకు పరులైనశ్రీరాజ పరహంసనీకూ॥ మంగ॥ ౪

అరలేకనంబూరి పురమందూనివసించి- పరతత్వాపరవాద పరవశమున-వీర భద్రదాసు వేటూరి-తో సేవించే నిత్యాపీరాకార సిష్కళంకునకు॥ మంగళం. ౫

## —లాలి పాట.—

### ౩౧—ఆనందభైరవి- అటతాళము.

లాలిసద్గురుడరామ నాతండ్రి లాలి ఓంకారభీమ॥
లాలిశ్రీవిజయరామ నాంతడ్రి లాలికరుణాబ్ధిసోమా॥లాలి॥౧
ఆంతరంగమునందునా నాతండ్రి వింతలేకను వెలుగుచు-
మంతనమునాలోకము నాతండ్రి అంతయూనిండినావు॥లాలి

దాసులాహృదయమందు నాతండ్రి భాశిల్లగానిలచియు-
లేశమైనావదలకా నాతండ్రి వాసమై యుండినావు॥ లాలి॥

నీనామమునుదలచుచూ నాతండ్రి నిత్యులయినిలచినారు-
నీనామమంత్రమెపుడూ నాతండ్రి ప్రత్యక్షముగనుందిరా॥లా

నీదాసులంతగూడి నాతండ్రి నీమీదభ్రాంతిచేత-
నీదాస్యమేజేయుచు నాతండ్రి నీపాటబాడినారూ॥ లాలి॥ ౫

యేకాంతరామరామ నాతండ్రి లోకాంత రామరామ-
శ్రీకాంతురామరామ నాతండ్రి నీకాంతినేజూతురా॥లా॥ ౬

పంచభూతములమీద నాతండ్రి మించియున్నా నీకళా
పంచవాయువులపైనా నాతం అంచితముగాచూతురా॥ ౭

అష్టదళపద్మమందూ నాతండ్రి నిష్టతోనిలచినీవు
అష్టాక్షరములతోటి నాతండ్రి అష్టమూర్తులగూడుకా॥లా॥౮

హరిరామరామరామ నాతండ్రి శివరామరామరామ
హరీగోవిందరామ నాతండ్రి హరినామరామనామ॥లాలి॥ ౯

ఆరుకోటలనడుమను నాతండ్రి అరుదుగానిలచినీవు
వేరులేకనుదాసులా-నాతండ్రి నిరతముగబ్రోచినావు॥లా॥౧౦

సహస్రారచక్రమందు నాతండ్రి చొచ్చిశోధించగాను
సహస్రకిరణముల వెలుగు నా సద్గురుడెరామగురుడు॥లా॥౧౧

ధరణిశ్రీనంబూరిలో నాతండ్రి వరదాసులనుబ్రోచుచూ
వరములిచ్చి [illegible] నాతండ్రి నిరతమేమరకుంమువు|| లా||౧౨
[illegible] ప్రహ్లాదాసుని [illegible] వెరపెంచదిర్చియు [illegible]
[illegible] సద్గురుడుగా నాతండ్రి [illegible] సుపదిలముపరిచెగా|| ౧౩
[illegible] పెరవమెలిలచయు-
దాసులకు మోక్షమిచ్చి నాతండ్రి వాసమును జేసుకొనుః
[illegible] తండ్రి [illegible] సానదాసవాస||
[illegible] లాలిసద్గురుడరామ నాతండ్రి లాలి ఓంకారభీమ||
లాలి శ్రీవిజయరామ నాతండ్రి లాలికరుణాబ్ధిసోమా|లా||౧౪

గద్యము.

ఇది శ్రీసద్గురు చరణారవింద సేవిత కవితాధురంధర
బ్రహ్మశ్రీ వంగలవంశపయః పారావార రా
కాసుధాకర శ్రీరామశాస్త్రి పుత్ర
శ్రీవత్స సగోత్రపవిత్ర వీర
భద్రదాస ప్రణీతం
బయిన తత్వజ్ఞాన కీర్తనలు
సంపూర్ణము.